# పల్నాటి ప్రశస్తి

రచయిత:

శ్రీ అక్కిరాజు నిత్యానందశాస్త్రి

ప్రకాశకులు

రచయిత కుమారులు

శ్రీ విద్యారణ్యులు, శ్రీ నరసింహదాసు

1959

# పరిచయము

## శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం గారు ఎం. ఎ.

ఆచార్యులు, ఆంధ్రభాషాధ్యక్షులు, ఉస్మానియా యూనివర్సిటీ హైదరాబాద్.

శ్రీ అక్కిరాజు నిర్వానందశాస్త్రిగారు రచించిన "పల్నాటి ప్రశస్తి" అను పద్య కావ్యమును చదివి సంతసించితిని. అక్కిరాజువా రిదివరకే పలనాటి స్మృతికి కృతోపకారులు. ఈ వంశీయులైన ఉమాకాంత విద్యాశేఖరులు పలనాటి వీరచరిత్రను ప్రకటించి ప్రశంసనీయమైన భాషాసేవ చేసిన పుణ్యమూర్తులు. ఈ పద్యకావ్యమునందు విద్యాశేఖరులకు కైమోడ్పులెత్తబడినవి. "గుత్తికొండ" యను శీర్షికక్రింద "చనికాంచందగు" మున్నగు పద్యములు ప్రకృతకవికి తమ వంశీయులపైగల భక్తిని తేటబరచును.

"పల్నాటి ప్రశస్తి" దేశభక్తి బోధకమగు చక్కని పద్యకావ్యము. పూర్వకాలపు స్థల పురాణములును ఇట్టివిగనే భావింపవచ్చును. అవి సాధారణముగ ఏదోయొక పుణ్యక్షేత్రమునకు సంబంధించి బయల్వెడలి అద్భుత వృత్తాంతములతో నిండియుండెడివి. ఈనాడు జనుల హృదయములలో స్వదేశాభిమానము, స్వప్రాంతాభిమానము, స్వభాషాభిమానము మిక్కుటముగా కానవచ్చుచున్నవి. తమకు భిన్నమైనవానిపై ద్వేషాసూయలు లేనంతవరకు, తమ యభ్యుదయమునకు వారిని కృతదీక్షులుగ చేయువరకు పై భావములు తప్పక పోషింపదగినవియే. ఆంగ్ల వాఙ్మయ పఠనముచే దేశభక్తిభావన మన బాల బాలికల

హృదయములందు పొడముచున్నది. ఆ భావమును స్వదేశము మీదికి ప్రాకచేయుటకు వలసిన గద్య పద్యకావ్యములు సులభ శైలిలో రచియింపబడినవి లభ్యములగుచో వారు చదివి యుత్తమ దేశభక్తులగుదురు. అట్టి యవసరమును శ్రీ నిత్యానందశాస్త్రిగారి "పల్నాటి ప్రశస్తి" చక్కగా పూర్తిచేయుచున్నదని నేను భావించు చున్నాను. ఇది స్కూలుఫైనలు విద్యార్థులుకూడ చదివి యర్థము చేసికొనగలిగినంత సులభశైలిలోనున్నది. కవిగారి వినిర్మల హృదయమువలెనే వారి శైలియు నిరాడంబరమై ప్రసన్నత కలిగి యున్నది.

దేశభక్తి యనగా మేము గొప్పవారము, మాదేశమెన్నడో లోకమున జ్ఞానపుదివ్వె వెలిగించినదను ఆత్మసంతృప్తి కాదనియు, గతమును స్మరించుచు, వర్తమానము మీదను, భవిష్యత్తు మీదను ముఖ్యముగ దృష్టినుంచవలెనను గురజాడ కవీంద్రుని సందేశ మును ఈ కవిగారు మిన్నగా పాటించినారు. పల్నాటిలోని గడ్డ గడ్డయు, గ్రామ గ్రామమును వీరచరితములచే గుబాళించుచునే యున్నది కాని యీనాడచ్చటి జీవనాధారమైన జీవనమే జనులకు కఱవై యిక్కట్లు పడుచున్నారు. అక్కడ అభివృద్ధికి వలసినంత ముడిపదార్థమున్నది. ప్రకృతి సంపదయున్నది. అడవులు, జల పాతములు, గనులు, అన్నియు దైవదత్తములై యున్నవి. వానిని పల్లెనాటి ప్రజల యుపకారమునకై మలచు మానవ ప్రయత్నమే కావలెను. పలనాటి పూర్వ ప్రాభవముపై భక్తి గౌరవములను భవిష్యత్తు విషయమై కర్తవ్య ప్రేరణయు ఉద్బోధింప వలసి యున్నది. "పల్నాటి ప్రశస్తి" కావ్య మీ రెంటిని చక్కగా సమన్వయించి కొద్దిలో ఆదర్శప్రాయముగ నున్నది.

ఉదాహరణకు 'ఎత్తిపోతల', 'పిడుగురాళ్ళ' వంటి శీర్షికలు చెప్పదగును. శ్రీనాథుని చాటువులుగా ప్రచారమగుచున్న కొన్ని పద్యములు పలనాటిని వెక్కిరించునవిగా ఉన్నవి. కవిగారు వీనికి చక్కని సమాధానములు వ్రాయుటే కాక వానినే కర్తవ్యబోధకములుగా తీసికొనుట వీరియుపజ్ఞకు తార్కాణము. "అడిగొప్పుల యోరుగాలినడగితినను మీ" అను చాటువులోని యడిగొప్పుల గ్రామమునకు నూత్నతేజస్సును కవిగారు సూచించుట యెంతయు కొనియాడదగి యున్నది.

పల్నాడు ఆంధ్రుల పాలిటి వీర పుణ్యక్షేత్రము. ఇది యాంధ్రదేశపు కురుక్షేత్రము. ప్రతి గ్రామమునకును ఏదో యొక మహత్తర చరిత్ర మేలి ముసుగుగ నుండనేయున్నది. పలనాటి విష్ణువు బ్రహ్మనాయుడు, నాయకురాలు, కారెంపూడి, గంగధార మడుగు, మాచర్ల, గురజాల, ఒక్కటొక్కటియు స్మరించునప్పటికే ఒడలు జలదరించును. కన్నులు చెమ్మగిల్లును. ఇవికాక పతివ్రతాతిలకమైన 'లక్ష్మమ్మ' గారి దుర్గిగ్రామము స్మరణకు గొనిరాబడినది. ఎడదబరువైనది. కన్నులు ప్రావృడంభోధరములైనవి. అకృత్రిమము, సరళము అగు కవిత్వమునందింత శక్తి కలదు గదా యనిపించుచున్నది 'పల్నాటి ప్రశస్తి' కావ్యము. పల్నాటి ప్రకృతిదృశ్యము లీకావ్యమునందు ఋషిదర్శనముతో, శిశుహృదయముతో, మెలకువతో వర్ణింపబడినవి.

'ఖురములంఘించి యిచట నేర్పరచినట్టి
హ్రదము విమలము సువిశాల మయ్యు నెపుడు

కలితవపుఃపుండు దూర్తని కాపురమ్ము
నడలుతో సల్పుకొను గేస్తురాలిపగిది.’

కవిగారి భావనాశక్తి ప్రశంసనీయమైనది. కోరినచో వారు పక్కాని దీర్ఘ సమాసకల్పనయు చేయగలరు.

‘అంతపోష్ప్లాయ మాన ప్రయాణ విలస
దభ్రపటలోపమేయ నౌకాశ్రిత బహు
జన విలోకన సంతత జనితమోద
భరిత మయ్యెను గృష్ణాస్రవంతి వినుఁడు.’

శ్రీ నిత్యానందశాస్త్రిగారి కవిత్వము ఆర్షమని యేటికోళ్ల సమర్పించి విరమింతును.

8-8-59
హైదరాబాద్

ఖండవల్లి లక్ష్మీరంజనం.



# అభిప్రాయములు

## శతావధాని : శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు

శ్రీ అక్కిరాజు నిత్యానందశాస్త్రిగారు రచించిన 'పల్నాటి ప్రశస్తి' అంతయు ప్రశస్తముగానున్నది 'గంగకు ఇద్దరి, అద్దరి' అను మాట లేదుకదా !

'నాదేశము' అనుశీర్షికతోడి పద్యములలో మొదటి పద్యము మొదటి మూఁడు పాదములు చదివి నవ్వుకొంటిని. ఏల నఁగా దేశమునుగూర్చి నేనొక పద్యము చాలకాలముక్రిందట వ్రాసితిని. ఆ పాదములకు ఈ పాదములకు భిదలేదు. అభిమాన విషయములకు హృదయ సంవాదముతోపాటు వాక్సంవాదముగూడ పొసగవచ్చుఁగదా ! అదియటుండె. 'పలనాటికి మాటికిఁదోవ నేటికిన్' అను పద్యమిఁక 'పలనాటికిఁ బొమ్మిఁక చీటిమాటికిన్' అని మాఱవలెను. దీనికనుగుణముగా పై పద్యమంతయు మారవలెను. 'పలనాటి ప్రశస్తి' అటులు మార్పింపఁగలదు. మఱియు ఇదికరణత్రయమునకును ఉత్తేజకము, ఆనంద జనకము.

4—8—59<br>చిరివాడ

వేలూరి శివరామశాస్త్రి.

## మహాకవి : శ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారు

అభిజనాభిమానం అందరికీ ఉండేదే అయినా, దానిని కావ్యరూపాన నిబంధించే భాగ్యమెవరికోగాని లభింపదు. నిత్యానందశాస్త్రిగారి ప్రశస్తిలో పల్నాటిసీమ తొల్లిటి వైభవంతో దర్శన

మిస్తున్నది. పల్నాటి నవహేళనం చేస్తూ పూర్వకవులు చెప్పిన చాటువులు హాస్యరసలోభముచే చెప్పినవేగాని ఇతరములు గావను కొందును. అందులకు ఆ కవులను తెగనాడవలసినపని యుండదు. శాస్త్రిగారి అభిమానము పల్నాటిపై ఈగను వ్రాలనీయనిది. శాస్త్రిగారి కవితాధార అనర్గళము. అద్దమునందువలె, వారి భావములందు స్పష్టమై కన్పించుచు హృదయమున హత్తుకొను చుండును. పలనాటిసీమవీరులకే కాక, కవులకును రత్నగర్భయని శాస్త్రిగారి కావ్యము తెల్లమొనర్చుచున్నది.

7–8–59 }
కాటూరు } కా. వెంకటేశ్వరరావు.

## శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు

ఆలిండియా రేడియో

పూర్వాంధ్ర చరిత్రకు, సంస్కృతికి, ఒక కేంద్రమైన పల్నాటిసీమనంత ఒకసారి పర్యటించి చూడవలెనని ఎంతకాలము నుండియో నాకు కుతూహలము కలదు. కాని ఆసంకల్పము నెర వేరనేలేదు.

శ్రీ అక్కిరాజు నిత్యానందశాస్త్రిగారు రచించిన "పల్నాటి ప్రశస్తి" అనెడి చిన్నకావ్యమును చదివినపిమ్మట, నేను ఆసీమను మనోగోచరముచేసికొని ఎంతో ఆనందించితిని. ఈకావ్యము, పల్నాటిని అంత స్పష్టముగా, స్వాభావికముగా చిత్రించినది.

10–9–59 }
విజయవాడ } పింగళి లక్ష్మీకాంతం.

విద్వాన్: శ్రీ క. సుబ్బరామప్ప, ఎం. ఎ., బి. ఇడి.,
ఆంధ్రభాషాధ్యక్షులు. మైసూరు యూనివర్సిటీ.

మీరు పంపించిన మీతండ్రిగారి ఖండకావ్యము "పల్నాటి ప్రశస్తి" అందినది.

శ్రీ కీ॥ శే॥ అక్కిరాజు నిత్యానందశాస్త్రిగారు, ఈ కృతి మూలమున చిరస్మరణీయులు. పల్లెనాటి పల్లెటూళ్ళను హృదయంగమముగ చిత్రించినారు. శ్రీనాథకృత 'పల్నాటి వీరచరిత్ర' ను తలపించినారు. ఇది సాహిత్య విద్యార్థులనేగాక తెలుగువారి నందరిని ఆనందింపచేయును. మీ కృషి అభినందింపదగినది.

30—7—59
మైసూర్ } క. సుబ్బరామప్ప.

శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు,
ఓరియంటల్ రీసెర్చి ఇనిస్టిట్యూట్, తిరుపతి.

మీరు దయతో పంపిన మీతండ్రిగారి 'పల్నాటి ప్రశస్తి'ని చదివితిని. శయ్యానిష్కల్మషమై, ధారాళమై, వ్యుత్పన్నమై యున్నది. పల్నాడునుగూర్చి శ్రీనాథుని చాటువులవలన కలిగిన దురభిప్రాయమెంతో, ఈఖండకావ్యము చదువుటచే తొలగిపోగలదు. ఆ చాటువులు శ్రీనాథునివి కావని గ్రంథకర్తగారివలె నేననుకోలేను. పలనాటి అందచందాలెట్లున్నను దానినిగూర్చిన యీకావ్యముమాత్రము రమణీయమనుట నిస్సందేహము. తప్పక ప్రకటింపఁదగినది.

30—7—59
తిరుపతి } రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ.

## విద్వాన్. శ్రీ నా. వేంకటేశ్వరశాస్త్రిగారు

మా మిత్రులు నిత్యానందశాస్త్రిగారు విద్యాపేక్షకుల చరణోపాంతమున సాహితీమర్మముల నలవఱచుకొన్నవారు. కవితావిరచనమును బాల్యమునుండియును సాగించుచున్నవారు. నవ్యయోగమార్గమున శ్రద్ధధానులయి, సాధనమును కూర్చుకొన్నవారు. 'పలనాటి ప్రశస్తి' యందు వారి పాండితికి తగిన ప్రతిభయును, ప్రతిభకు తగిన యావేశమును, ఆవేశమునకు తగిన మాటల తీరయిన కూర్పును, కూర్పునకుతగిన నేర్పును ప్రతిపుటయందును గాంచగలము. పరువంపు వయస్సుననే, తమ రచనలను కీర్తిమూర్తిగా నిలిపి, దివంగతులగుట నితాంత చింతాకారణమేగాక దేశదౌర్భాగ్యమనక తప్పదు. వారి తక్కిన మధురరచనలుకూడ అనతి కాలమున వెలుగులోనికివచ్చి ఆంధ్ర పాఠకజన హృదయప్రీణన మొనర్పగలవని ఆశింతుము.

18—7—59<br>
అమృతలూరు } నా. వెంకటేశ్వరశాస్త్రి.



మహోపాధ్యాయ, శతావధాని, విద్యావారిధి:

## శ్రీ కాశీ కృష్ణాచార్యులుగారు

శ్రీమత్ ('పల్నాటి ప్రశస్తి') అను ఖండకావ్యమును, కృతికర్తగారి పుత్రరత్న, విద్యారణ్యులవారి ముఖమున నామూలాగ్రము ప్రత్యక్షర పరిశీలనాపద్ధతితో విన్నాను. తనివితీరక రెండు పర్యాయములు చదువుట సంయోగమూతో నేనే స్వయముగా, చదువుకొన్నాను. స్వతస్సహజ కవితావిశిష్టతను ఈ కవియందు గుర్తించితిని. పామర జనమునకుఁగూడ, వర్ణ్యములగు సూక్ష్మార్థములును పరాపేక్షలేకయే గోచరించుట సత్కవితా లక్షణమని నా హృదయము. అది యీ గ్రంథమున గోచరించినది.

18–9–59
గుంటూరు

కాశీ కృష్ణాచార్య.



# "మనవి"

ఈ గ్రంథకర్తగారి జన్మస్థలము గుత్తికొండ. శైశవమందే పితృ వియోగము కలిగి, మాతృ పరిరక్షణలో కౌమారదశ జన్మస్థలమందే గడచినది. వారి పినతండ్రిగారి కుమారులు శ్రీ ఉమాకాంత విద్యాశేఖరులవారికడ, వ్యాకరణతర్క శాస్త్రాభ్యాసము, సాహిత్యవ్యాసంగము జరిగినది. అప్పటిలో వీరి రచనలు సారస్వత వ్యాసములు "భారతి"యందు ప్రకటింపబడినవి. అప్పటికే వారు సెకండరీ గ్రేడు ట్రయినింగునం దుత్తీర్ణులై ఉపాధ్యాయ వృత్తిని స్వీకరించియుండిరి ఆనాడు పల్నాటియందు విద్యావ్యాప్తికై బహుళముగా కృషిచేసి "ఆదర్శ ఉపాధ్యాయుడు"గా మన్ననలందిరి. వారి విద్యార్థులీనాడున్నత స్థానములనున్నను తమ గురువును మరువక తమ జీవితములకు రాచబాటలు తీర్చిదిద్దిన సాటిలేని మేటి యుపాధ్యాయుడని ప్రశంసించు చుందురు.

యౌవన దశయందు వారికి సహధర్మచారిణీ వియోగము గల్గినది. ఈ సంఘటన వారిలో గొప్ప మార్పుతెచ్చినది వారి సాహిత్యోపాసన యింటిలో విరమింపబడినది. వార్ధక్యములో వారి తల్లిగారిపైబడిన కుటుంబభారము, తల్లిలేని బాలురము, రెక్కలురాని పసికందులమగు మా పోషణభారము వారిలో ఏదో ఆలోచన గల్గించినది. చిత్తస్థైర్యము వీడక కేవల పరమేశ్వరచింతననే అవలంబనముగా గ్రహించి యోగాభ్యాస మొనర్చుచు కేవలము "ఋషి జీవితము" గడిపిరి. దుఃఖమునుమరచుటకై గ్రంథరచనము చేయుచుండిరి. అపుడు "భీష్మ ప్రతిజ్ఞ" "లవకుశ" నాటకములు, "ధ్రువచరిత్ర" హరికథ వారిచే రచింపబడినవి. సహజ గానమాధుర్యము గలవారగుటచే "లవకుశ" నాటకమును విద్యార్థులమగు మాకు నేర్పి మాచే పలుచోట్ల ప్రదర్శింపజేసిరి. సత్తెనపల్లి పట్టణమున ఒకనాటి ప్రదర్శనమునకు వేయి రూపాయిలకుపైనా "కలెక్షను" వచ్చినది. ఆ ధనమంతయు విద్యావ్యాప్తికై వినియోగింపబడినది.

మా సోదరులలో సంగీత సాహిత్యములయందు బహుళముగ కృషిచేసి, బి. ఏ. వరకు చదివి గాత్ర మాధుర్యమునకు శాస్త్రీయ సంగీతమునకు బహు ప్రశం

సలు పొంది, కుటుంబమునకు కీర్తిప్రతిష్ఠలు గడించుచుండిన "గోవర్ధనుడి" అకస్మాన్మరణము వారిని పూర్తిగా విరాగులనొనర్చినది. వారనుభవించిన దుఃఖము వారి రచన "పల్నాటి యుద్ధము"లో అలరాజు నిర్యాణానంతరము కొమ్మరాజు ముఖమున ప్రకటింపబడినది. ఐనను జనకుని కర్తవ్యమును గుర్తించి "జనకుని" వలె నంటియంటనట్లు తటస్థులుగా నుండి కర్తవ్యమును నిర్వహించుచుండిరి.

వారి ఈదశయందు తోచినపుడెల్ల ఏదో వ్రాయుచు "అనపోతన" ఏకాంకిక నాటిక పల్నాటి చరిత్రయందు "రాయబారమువరకు" నాటకము "కాళిదాసు సందేశము" ఆంధ్ర, ఆంగ్లములందును, "ప్రల్నాటి ప్రశస్తి" "సృష్టివిచిత్రము" ఖండకావ్యములను రచించిరి. వారి ఏబదియేడవయేట "యోగేనాంతేతనుత్యజాం" అను ఆర్యవాక్యమును దలపించి దివికేగిరి.

యశస్తృష్ణలేనివారు జీవితకాలమందు వారి రచనలను తామై ప్రకటించుకొనలేదు. తల్లి, తండ్రి, గురువుగా, కనిపెంచి, పోషించి విద్యాబుద్ధులు గరపిన మహనీయుని సేవ యొనర్చు భాగ్యము, కీర్తిశరీరులగు వారి కృతుల నిపుడు ప్రకటించు నదృష్టము మాకు లభించినందులకు మేము కృతార్థులము. బుద్ధిపూర్వకముగాని యీ ప్రకటనయందలి యాలస్యమును సుహృదయులైన సహృదయులు క్షమించ ప్రార్థన.

ఇందలి పద్యములు పుస్తక రూపము దాల్చుటకుముందే ఆమూలాగ్రముగ తమ పత్రికయందు ప్రకటించి ప్రచారమొనర్చిన సహృదయులు, రచయితలు "ప్రజావాణి" పత్రికాసంపాదకులు శ్రీ వట్టికొండ రంగయ్యగారికి మా కృతజ్ఞతను తెల్పుకొనుచున్నాము. పుస్తకముపై అభిప్రాయములొసంగిన పెద్దలకు, విద్వత్కవి ప్రముఖులకు హృదయపూర్వక నమస్కారము లందజేయుచున్నాము. పుస్తకమును వెలువరచుటకు ఆదినుండి మాకు ప్రోత్సాహమొసంగి పుస్తకమును సరిచూచి తోడ్పడిన మా సోదరుడు విద్వచ్ఛిరోమణి అక్కిరాజు వేంకటేశ్వరశర్మకు మా ధన్యవాదములు.

సహృదయులగు పాఠకమహాశయుల యాదరము, పెద్దల యాశీర్వచనము మాకండగా నున్నచో అచిరకాలముననే మా తండ్రిగారి యితర గ్రంథములను ప్రకటింపగలమని ఆశించుచున్నాము.

వికారి<br>
విజయదశమి<br>
**11–10–1959**

విధేయుడు,<br>
అక్కిరాజు విద్యారణ్యులు.





జననియు జన్మభూమియును స్వర్గముకన్నను మాననీయముల్
కనఁదగు నైజసృష్టి పరికల్పిత దివ్య మనోజ్ఞదృశ్యముల్
వినఁదగు వీరసీమ దలపించెడి పూర్వకథావిశేషముల్
మనమున వేడ్కఁగల్గు నభిమానులు దీనిఁ బఠింపఁగోరుదున్

— రచయిత.



# కృతి సమర్పణము

స్వీయ వృత్తాంతమిఁకఁ గొంత చెప్పవలఁతు
బ్రహ్మఋషియైన గాధిపుత్రప్రభవము
వంశము జనించె నందొక పరమయోగి
తత్త్వవిదుఁడైన మత్ప్ర పితామహుండు.

దూరీకృత దోషుఁడు, సువి
చారుఁడు, యోగ ప్రభావచరితుఁడు, లక్ష్మి
నారాయణాఖ్యుఁ, డనఘుఁడు
దారుండయి శిష్యులలరఁ దత్త్వము గఱపెన్.

తాత వ్యాసుఁడు - దూర్వాసుఁడాతఁ డెంత
కోపశీలుఁడొ - యంత సద్గుణమహత్త్వ
కలిత, సుచరిత్ర, దాక్షిణ్య కల్పవల్లి,
తాల్మి వెనలేని లచ్చమ్మ - తండ్రి తల్లి.

తండ్రి మృత్యుంజయుం డన్నదాతయనెడి
ఖ్యాతి గైకొనఁడారె మన్మాతవలన
ధవునియాజ్ఞను శిరమునఁ దాల్చినట్టి
సద్గుణకదంబ భ్రమరాంబ సాధ్వి తల్లి.

జనకుఁ గోల్పడఁగా మేము శైశవమున
శ్రమగణింపక యష్టకష్టముల కోర్చి
సాటివారలతోఁ బాటు సౌఖ్యమురసి
పెద్దవారల మముఁజేసె పెంచి తల్లి.

తల్లి ప్రేగందురు గణించి ధాత్రికన్న
జన్మభూమికి సర్వము సాటిరాదు
జననికిని జన్మభూమికి వినుతిగూర్చి
అంబకొనరింతు నీకృతి నంకితమ్ము.



# నా దేశము

"ఇది నాదేశము, మాతృభూమియిది, నాకిచ్చోటి తోఁటల్, నదీ
నదముల్, భూములుఁ, బ్రాణతుల్యము, లిటన్నాజాతి వర్ధిల్లు ని
య్యది మా సంస్కృతి కాలవాల"మని యాహ్లాదంబు దీపింప నె
మ్మది భావింపఁగ లేనిమానవుఁడు సన్మానార్హుఁయు సుంతదే?

అవినీతిన్ మదినించి, స్వార్థమునకై యారాటమున్ బెంచి, శ
త్రువునామించి, స్వదేశపుం బ్రజలకున్ ద్రోహంబుఁ బాటించి, గౌ
రవమున్ డించి, ప్రమత్తుఁడై విభవమున్ బ్రాపించుకంటెన్ బరా
భవ మింకొక్కటిలేదు - మానధనుఁడా పాపంబుపైఁ దాల్చునే.

మనమును గాల్చివైచు - నవమానము నాపుకొనంగలేని వ
ర్తనమున మాతృదేశమును దాస్యమునంబడఁ ద్రోసినట్టి నిం
దను జయచంద్రుఁ డెట్టులోడిఁ దాల్చెనొ వ్రాల్చెనొ మేను! తత్కృతం
బున మన భారతం బెటులు పొందెనొ కీడు! గణింపఁగాదగున్.

నైపఁగలేక బొబ్బిలి యశంబు, నసూయకు దాసుఁడై పరుల్
ప్రాపుగఁ బొంగుచున్ విజయరామనృపుండు, మహాహవంబునన్
రూపఱఁగన్ స్వదేశజులు, ద్రోహమునల్పి, కృతాపరాధ సం
తాపముతోడఁ జచ్చియును దాల్పఁడె నిందను శాశ్వతంబుగన్?

తనదేశంబు మహత్త్వమున్ బడయఁగా దారిద్ర్య మీడేరఁగా
తనవారల్ కడగండ్లు దీరిమనఁగా, ధర్మంబు వర్ధిల్లఁగా,
తన జాతీయత దివ్యకీర్తిఁగనఁగాఁ దానడ్డమైవచ్చు నిం
దను సంధానము చేయుకంటెను దనుత్యాగంబు మేలెన్నఁగన్

"జననియు జన్మభూమియును స్వర్గముకన్నను మాననీయముల్
కనుఁ"డను నార్యవాక్యమిది-కల్మషమున్ హరియించు,హర్షసం
జనిత వినీతివీచికల స్వాంతములన్ వెలయించు, భావనం
బెనగొని విన్నమాత్రమున వీనులకెంతయు విందుగూర్చెడున్.

తనజనంబును రక్షింపఁ దారసిలని
వారి నాడుల నుబికించి పాఱుచుండు
రక్తధారలు కలుష నీరంబటంచు
పలికియుండడె శ్రీనాథభట్టసుకవి ?

"ఇది స్వదేశము, పుట్టితి నిచటననుచుఁ
ప్రేమతోఁ బొంగిపోని నిర్వీర్యుఁడెవ్వఁ
డుండఁబోఁ"డని పాశ్చాత్య పండితుండు
చాటుచున్నాఁడు మహితుఁడు స్కాటుసుకవి.

మాతృదేశము ప్రాణ సమాన మనుచు
సేవయొనరింప సుతికెక్కి, త్రోవఁదప్పి
చెడుగు సేతలఁ జెనఁటియై చేయునేని
వచ్చు నపకీర్తి మానని మచ్చయగుచు.

## పల్నాటి ప్రశంస

నాఁటి బౌద్ధులకిండ, నాగార్జునికొండ,
    గణుతికెక్కిన మస్తకంబుగాగ
విఖ్యాత శిల్పులు లసిన పెందోఁట,
    మహనీయ మణికంఠ మాలగాఁగ
అద్రిగహ్వరము మహోసుశ్రుతినిఁగూర్ప
    తీరుగాఁ దెరచిన నోరుగాఁగ
సంగ్రామ విక్రమ సాహస సాక్షియై
    వీరగానము నాగులేరు సలుప

శ్రావ్యముగ వంతఁ బాడఁగాఁ జంద్రవంక
వారి పాతమృదంగము ఘోరుకొనఁగ
కవి వతంసుని సత్కావ్య కథనుజాటి
చెప్పుచుండెడి పల్నాటిసీమఁ గనుఁడు.

వాహినియైనకృష్ణ యొకవంక పవిత్రగతింజలింప, దు
ర్గాహతఁబొల్చు సాంద్రవటరణ్యము తక్కినయూడ్పువైపులన్
వ్యూహమురీతి నల్లుకొనియుండ, మహత్త్వ మనోజ్ఞదృశ్య సం
దోహము పల్లెనాటు కనువోయికి విందొనొసంగుఁ జూడుఁడీ.

ఖనిజవాటులు, తోఁటలు, కాననములు
పుణ్యభూములు, సుక్షేత్రములు, జలప్ర
పాతములు, నిర్ఝరమ్ములు, ప్రమదమొదవు
ప్రకట చారిత్రకస్థలి పల్లెనాడు.

వజ్రములుగూడఁ గృష్ణా ప్రవంతిచెంతఁ
బడయనగునని తలఁతురు పల్లెనాట
సత్కళాఢ్యులు భూగర్భ శాస్త్రవిదులు
ఖనిజవైవిధ్య మిచ్చటఁ గలయనరసి.

సిద్ధులను, యోగివరులఁ బ్రసిద్ధకవుల
ప్రథితశిల్పుల, దివ్యప్రభావయుతుల
సకల విద్యాధురీణుల సచ్చరితులఁ
బడయఁ గల్గిన స్థానము - పల్లెనాడు.

పల్నాటి ప్రశస్తి

ఖండన మొసంగు సద్యశః ప్రాప్తిగోరి
పొంగ రక్తము, మేనులు పులకరింప,
సమర రంగమ్ములందుఁ బ్రచండ వీర
వరులు దూకిన స్థలమిది — పల్లెనాడు.

ఎండిపోకుండ సామ్రాజ్య వృక్షమునకు
దోహదంబుగ రక్త ప్రవాహమిడిన
మహితుల, రణప్రసిద్ధుల, మానధనులఁ
బడసిన మహాస్థలంబిది — పల్లెనాడు.

స్వజన సంరక్షణ మొనర్చు సమయమొదవ
వచ్చినన్ బ్రదికినఁ గల్గు స్వర్గమనుచు
ఖడ్గములనిచ్చి భర్తలఁ గదనమునకు
పడతులంపిన స్థలమిది పల్లెనాడు.

బ్రహ్మనాయుఁడు, నరసింగ పార్థివుండు
గండు కన్నమ, బాలచంద్రుండు, సంగ
డీలు, తదితర వీరకంఠీరవమ్ము
లాహవ తరంగముల నోల లాడిరిచట.

వీర పత్నీత్వమే సర్వ విభవమనుచు
మగువ మాంచాల ధవు విక్రమ ప్రకాశు
దీవన లొసంగి నగుచు సుద్రిక్తుఁజేసి
ఖండనోర్విని దుమికించెఁ బల్లెనాట.

వీరపాపమ్మ, యనపోతుదార, దుర్గి
లక్ష్మి, నలగాముసుత, నిస్తులప్రవృత్తి
నద్భుత సతీత్వధర్మము లాచరించి
కాంచి రాచంద్రదతారక ఖ్యాతినిచట.

పలునాడాహిత వీరధారణీ జనప్రస్తూయమానంబు స
త్కల కాస్థానము శ్లాఘ్యాదృశ్య ధృత సౌందర్యాలవాలమ్ము ని
ర్మల చారిత్ర విశోభితమ్ము కవిసన్మానార్హ శ్రీనాథ వా
గ్విల సద్దివ్య కథాప్రతిష్ఠిత యశోవృత్తం బుదాత్తంబుగన్.

ఇచ్చటి పల్లెనాటి విధమెల్ల నరణ్యము మూడుపైపులన్
జెచ్చెరగాంచి శ్రీనగముఁజేరి పయింబయిఁ బర్విమెచ్చుగా
నచ్చతఁజూపి సాంద్రముగ నూగుచు నొక్కవిధాన నెచ్చటన్
త్రచ్చినఁ దెంపులేక బలితంపు మృగాల భరించు మించుచున్.

గహనమునందుస్వేచ్ఛగ మృగమ్ములు గ్రుమ్మరు, గుంపులై, ముదా
వహముగఁ గొన్ని, జాతిసహవాసముగోరక కొన్ని యొంటిగన్
సహజపుఁజేష్ట లార్భటులు సల్పుచు శత్రువులద్ధగింప నా
త్మహితమెఱింగి నేరుపునఁ దాఁగుచుఁ, దాఁకుచు మీఱి పోరుచున్

పుట్టలంజేరి రంధ్రాల ముట్టె లుంచి
భల్లూకములిటఁ జీమలఁ బట్టి మ్రింగు
కొండమ్రుచ్చులు గగ్గోలు గొలుపుచుండు
పులుల నెదిరించి పోత్రులు పోరుసలుపు.

చిటుకుమన్న లేళ్ళు తలలెత్తి చెదరు గదుర
బెదరి చూచుచు సొబగును విదిత పరచు
మహితముగఁ గేకు లుద్ధయాత్త ఘుఘుము లందు
కలయుచుండుఁ బ్రతిధ్వనుల్ గొలుప గిరులు.

పోతరించిన పెను మనుఁ బోతులిచట
పదిలముగ నుండు పాటవప్ఁ బట్టులరసి
పులులకైనను వెఱపును గొలుపఁ జాలి
పరపి, ఘోరకయి, రేఁచులు దిక్కుగు లాదు.

దప్పిగొని నీటిపట్టులఁ దఱియఁ గోరి
గాలి వాలున కెదురుగఁ గనఁ దలరిగి
క్రోలి వాసన వేసవి రేలయందు
మాటులు గనుం గొనం జాలి మాయ మగును.

బొరియలఁ డాగి పగలు రేప్రొద్దు వెడలి
చిఱుత పులులకు నైతము చిక్కకుండ
కర్కశము లగు కంటక కవచములను
దాల్చి యేదులు మసలు నుద్ధతి వహించి.

మధుపములు కోనలఁ దుర్గమ స్థలముల
గుట్టుగాఁ జేరి యున్నట్టి పట్టులరసి
దిట్టలగు పల్లె వాసులు తివిరి తేనె
పడసి చనుచుందు రుత్సాహ భరితులగుచు.

నెమకి కొర్నాసి గండ్లను చమురు కొఱకు
పులులఁ జిఱుతలఁ జర్మము ల్వొలుచు కొఱకు,
పడయు కొఱకును ధాన్యముఁ బల్లెలందు,
వేట కాండ్రిటఁ గూల్తురు విక్రమించి.

తఱుఁగు లేనట్టి పచ్చి మేతల పొలములు
గట్టి గుఱి కాండ్రు మాటలు గాయుచుండు
స్థలములు, ప్రహృష్ట గోపాల సంగతమ్ము
లడవులివి యాలమందల కాశ్రయములు.

కలవు తెరచాటు వేసాల కరణిఁ దనరి
జింక లడవుల నీనాట, నింకవీని
నరయ రంగాలు పాల్వాయి యంతికములు
పిన్నలి పొలాలు రెంటాల బీళ్ళ చేలు.

గుంపుగ జింక లీయెడలఁ గూడ గమించెడి పిల్ల మూఁకతో
నింపుగ నుండు మేతల గణించి మెసంగుచుఁ జప్పుడైన నూ
హింపఁగ మోరలెత్తి చెవు లిట్టె నిగుడ్చి కను ల్చలింపఁగా
సొంపును బెంచి బెగ్గడిలి చూపు హఠాద్గతి వాయు వేగమున్.

పగలు తనుపారఁగా మేసి భానుఁడేగ
బయలు నంచొక్క వలయ మేర్పడఁగ దీరి
అష్ట దిక్కులకివి తల లలవరించి
పండుకొను మధ్యగాఁ బిల్లలుండు నటుల.

# ఎత్తిపోతల

కలదొక వారిపాత పరికల్పిత దృశ్యము పల్లెనాటిలో
జలజల శైలమస్తమున సల్పి ప్రయాణము "చంద్రవంక" య
గ్గలిక వహించి మించి తమకంబునఁ గ్రిందికి దూకు "ఎత్తిపో
తల" యను తావు గ్రావ ధృత తాండవ రమ్య ఝర ప్రభావమై.

సాంద్ర గహనము కేశ పాశమ్ము వోలె
గాలి తాకుడు కల్లనఁ గదలు చుండ
సలిలధార తురాయిగాఁ దలను దాల్చి
యచల మిచ్చోట విభవము నవధరించు.

అద్రి చెంగట మిట్ట మధ్యాహ్న మపుడు
సలిలపాతము మిఱుమిట్లు గొలుపు చుండు
నసితవర్ణఁపు మేఘము నాశ్రయించి
మెఱయు విద్యుల్లతల మిలమిలలు దాల్చె.

ఝరము లంఘించి యిచట నేర్పరచినట్టి
హ్రదము విమలము సువిశాల మయ్యు నెపుడు
కలతపడుచుండు ధూర్తుని కాపురమ్ము
నడలుతో సల్పుకొను గేస్తురాలు పగిది.

మొగలి పొదల సువాసనల్ ముదము గొలుప
క్షేత్రమిది తొల్లి నిష్ఠా ప్రసిద్ధుఁడగుచు
విగ్రహమున దత్తాత్రేయుఁ డుగ్రతపము
సల్పినస్థలమ్ము, దివ్య హర్ష ప్రదమ్ము.

భానుఁడు ప్రాగ్దిశాచలముపైఁ గనిపింపఁ బ్రసన్నమూర్తియై
కాననవాటి యామినులఁగ్రైకొను దాఁగురుమూఁత వీడఁగాఁ
బైనమునెప్పటట్లు జలపాతము సల్పఁగఁ గాంచి మోదమున్
బూని నటించు బర్హులిటఁ బుట్టఁగఁ గ్రేంకృతులన్ బ్రతిధ్వనుల్.

సందులు చూచి కల్మిగల స్థానములంబడి తిండిలోపమున్
పొందని మాయచుట్టములఁబోలి ఫలాదుల నిప్పుచొప్పునన్
విందు భుజించి గంతులిడు వేడ్కతఁ జూపెడు కోఁతులమూఁక లం
దందుఁ జరించుచుండు నిట నద్రిపథమున్ గుహాంతరంబునన్.

రమ్య గతితోడ వచ్చునిర్ఝరము దాల్చి
జలవిహంగముల సంతసము వహించి
నెత్త మలరించి ప్రేక్షక చిత్తములను
పాదుకొలుపును సంతోష పథమునందు.

చల్లని పిల్లగాలులు ప్రసన్నముగాఁ బయివీచుచుండఁగా
నుల్లము లుల్లసోర్మికల నూగును స్వచ్ఛఁపుఁ గుల్యవోలె భా
సిల్లును కృష్ణ దప్పుల విచిత్రఁపుసోయగముఙ్గాధరించి సం
ధిల్లు విశాలభూతలముఖు దృక్పథ మందిట విశ్రమించినన్.

నెత్తమునఁ జేరి కను ప్రేక్షణికుల కగము
హ్రాదము చెంగట నాసీనుడైనశౌరి
చోద్యమగు వామనాకృతుల్ చూపి తెలుపు
నున్నతంబగు స్థితి తన కున్న విధము.

నిండు నెలయేఱు దుముకుచుండు నపుడు
శ్యామలాటవి సొబగును జూచునప్పు
డద్రి తమిదీర సుమమయమైనయపుడు
విదితమగు క్షేత్రశోభ ప్రావృట్టునందు.

పొదలు సుమపల్లవములతోఁ బొదలు లతలు
సకల పాదపములు తమశక్తికొలఁది
కేతకులకు సాహాయ్యము కెరలి సలిపి
సౌరభము రేఁపు పుష్పించు సమయమందు.

కారుమునగలు పెల్లునఁ గలయఁబూచి
అచ్చపు ప్రసూనరాసుల యట్లు బొలిచి
నేత్రపర్వ మొనర్చుచు క్షేత్రమునకు
నొసఁగుఁ బుష్పాంజలులను మహోత్సవమున.

ప్రణయవశమునఁ దేఁటులు పాడుచుండ
నడవి పక్షులు సంస్తుతు లాచరింపఁ
బవనుఁ డేతెంచి క్షేత్రము వడసి యుల్ల
సిల్లి పుప్పొడి బుక్కాము చల్లుచుండు.

తీరుగా నొక విగ్రహ స్థితిని దాల్చి
దేవళంపుఁ గవాటమ్మును దీసివైచి
స్థిరమగు విలోకనమ్ముతో క్షేత్రమెప్పు
డోము శ్రీరంగనాయకస్వామి యుచట.

అత్రితనయుని స్నానపుణ్యము గడించి
దివ్యగరిమొప్పు క్షేత్రసంస్థితిని బడసి
కలుషరహిత శిలాతలాక్రాంతిఁ దనరు
హ్రదము రమణీయ మిచట హర్షప్రదమ్ము.

చండకరు తాప మలయించు సమయమందు
సర్భకుల్ పశుపాలకు లరుగుదెంచి
పడసి హ్రదమును బల్లటీల్వైచి యీది
తనిసి చనుచుందురు ప్రమోదమును వహించి.

యాత్రికులు హ్రదమున స్నాన మాచరించి
దాపున మహోశ్మ వేదికా తలముల పయిఁ
జేరి సుడిదీరి యలవారి కూరుచుండి
ముగ్ధులై పోవుదురు దృశ్యమును గణించి.

శాశ్వత జనోపకార ప్రసక్తి వడయ
క్షితికిఁ దిగివచ్చి తగు పరిస్థితులకొఱకు
విడుపు లేకుండ స్వామిని వేడునట్లు
సతత నిర్ఘోషమిచ్చట సలుపు ఝరము.

సెలయేరియ్యెడఁ గోరు తీరున నవిచ్ఛిన్నంపు విద్యుద్విధుల్
వెలయింపంగఁ బరిశ్రమల్ బహుముఖావిర్భావముం జెందెడున్
పలునాడద్భుత యంత్ర మందిరమగున్ బ్రాపించు భాగ్యోన్నతిన్
కలుగున్ సౌఖ్య మనేకపట్టణములన్ గ్రామంబులన్ బల్లెలన్.

# గుత్తికొండ బిలము

కలదొక శైలగహ్వరము కాననమధ్యమునందు, శాంతికిన్
నిలయము, మౌనివాసము, వినిర్మల తోయ సరః ప్రదేశ సం
కలితము, పావన స్థలము, ఖ్యాతివిశిష్టము, నైజసృష్టి స
త్ఫలదము, "గుత్తికొండ బిల ధామము", సర్వజనోపలక్ష్యమై.

ప్రకృతి యొక బోలుకొండను పాదుకొలిపి
తెచ్చె గుహలోని కెటులనో! తీర్థములను
తఱుఁగు పడకుండఁ దీవ్ర నిదాఘమునను
స్వచ్ఛముగ నిచ్చటి ప్రశస్త జలము దనరు.

మౌనులకు పాలొసఁగ మేఁక లోని కేగ
గొల్లఁడొక్కఁడు దానిని గూడనాడి
యరసెనని సలిలములు గుహాంతరమున
తెలుపు జనవాక్య మొక్కటి తేట పరచి.

చూచెనో ! గొల్లఁడీవింత చూడలేరొ !
యీ విచారణతోఁ బని యేమి గాని
యిది మహాక్షేత్రమని మెచ్చ నెచటి జనులు
తఱియుచుందురు తండోపతండములుగ.

కలఁడు బిలముఖమున మల్లికార్జునుండు
వెలుఁగు చీఁకటి తెరలను గలియు చోట
తాల్చి యాత్రిక వాత్సల్య తత్పరతను
దీపికలతోడఁ బొండని తెల్పు భవుఁడు.

రివ్వుమని గాలి వీచగా రెక్క లార్చి
కొండ గబ్బిలములు శ్రమఁ గొంతఁ దీర్చ
పోవఁబోవఁగ చీఁకటి త్రోవఁబట్టి
యరయఁగల మొక్క దివ్యమౌ హ్రాద సలిలము.

కలశములఁబట్టి యుంచ నీ గహ్వరంపు
జలము చెడిపోవ దెన్నాళ్ళు చనిన్నైన
ఎంచి గంగాజలమ్ముగా నింక దీని
గాంతు రీస్థలి దక్షిణ కాశి గాఁగ.

ఘన స్వర్ణంపుఁ గిరీటమట్లు రవి శృంగం బెట్టి వాటించుచున్
ధ్వనిగాఁ బర్వతరాజ మిద్ది యని తెల్పంజూచునట్లుండఁ ద
ద్వనబర్హుల్ కయివారమిచ్చును జగత్ప్రాణుండు వృక్షంపు వీ
వనలాడించు బిలంపుఁగొండ కుదయప్రాప్తిన్ దినాంతంబునన్.

దరియిచ్చోటు "మహాప్రసిద్ధ ముచుకుంద క్షేత్రరాజమ్ము" సు
స్థిర పుణ్య ప్రణిధాన మారయఁగ నీ తీర్థమ్ము దీక్షా ధురం
ధర మౌనీశ్వరపావితమ్మిటులఁ నేతత్ క్షేత్ర ప్రభావమ్ము వి
స్తరిలన్ ఖ్యాతినిఁగూర్చి యొక్కయితిహాసం బొత్తిభాషించెదున్.

విమలక్షేత్రము భక్త మౌని మహిమావిష్టంబు కాంతార మ
ధ్యమునందుంట బిలాద్రి పాదప సమూహంబూగఁగా నిత్యమున్
తమకంబొప్ప నరణ్యజాత సుమగంధవ్రాతమున్ జిమ్ము నం
దముతో శంకరుమూర్తి దానికిటు మోదంబున్ సదాక్షిణ్యతన్.

నిరతింబూని మహానుభావులు తపోనిష్ఠం బ్రమోదింప నీ
దరిఁ బ్రాపించిరి పుణ్యతీర్థ విలసద్ధామంబుగా నెంచి, త
త్పరతన్ నేటికిఁగూడ నేశబరులో! తర్కింప నింకెవ్వరో!
తరుణుల్ భీతిలకున్నవారిచట తత్సాన్నిధ్య మోహంబునన్.

ధ్యాన నిష్ఠాగరిష్ఠుఁడై తపముసల్పి
ధావివిషయాల యెఱుకను బడసినట్టి
తత్త్వ విదుఁడగు మత్ప్రపితామహుఁ డిట
కోరి యేకాంతవాసముఁ జేరుచుండె.

కానసమ్మన నావులఁ గాయునాఁడు
బాల్యమున నొక్క యోగీంద్రు ప్రాపు వడసి
యేగి శ్రీశైలమునఁ బది యేండ్లు నిలిచి
బ్రహ్మ విద్యను నేర్చె నీ ప్రవిమలుండు.

దూరీకృతదోషుఁడు సువి
చారుండు మహాప్రభావచరితుఁడు లక్ష్మీ
నారాయణాఖ్యుఁ డనఘుఁ డు
దారుండయి శిష్యులలరఁ దత్త్వముఁ గఱపెన్.

ప్రజలు దురపిల్ల వెఱపించి బాధపరచు
ధూర్తమాంత్రిక తాంత్రిక దుర్మతులకు
సామజములకుఁ గేసరి స్వప్న మట్లు
గుండెగాలమ్మగఁ బ్రసిద్ధుఁడుండె నపుడు.

తనజ్వరమ్ముమ్రను జేఁగట్టిదాల్చి పడఁక
సంధ్యనర్చింపఁ జాలిన సద్యశుండు
పర్వదినముల మోదము పడసె నిటఁ బ్ర
శాంతముగఁ దుంగతుర్తి బుచ్చయ్య యోగి.

వీని మహిమను గని మాదువృద్ధు లపుడు
విషయమును దెల్పుచుండఁగా వింటి నేను
కనుక సాక్షాత్తుగా వారు గనినయట్టి
సిద్ధమహిమల వేనోళ్ళఁ జెప్పుకొనిరి.

ఇచట నుండెను నరువది యేండ్ల క్రింద
నోషధి ప్రజ్ఞగల రామయోగి వరుఁడు
అద్భుతుఁడు గొల్ల మర్మఁపుటవయవముల
శిలలఁ బొడిచినఁ జావని సిద్ధుఁడొకఁడు.

ఇది యిటీపలి వృత్తాంత మెచటి వాఁడొ
వచ్చె ననఘుఁడు బిలఁపునివాస మరసి
ఇట వసించెను బహుకాల మెన్నిక గని
ప్రకటపఱచుచు మహిమలఁ బ్రజల కపుడు.

బిలపుఁ బ్రాంతాన పగలెల్లఁ బొలమునందు
గోపకుల జాడ నరయుచుఁ గూడఁ జనుచు
నలముకొని చుట్టుపట్టుల నండ బాయ
కుండ మేయును ధేనువుల్ తండములుగ.

తరణి గ్రుంకెడితఱి నింటి దారిఁ దీసి
కాపరుల్ వేయుచుండు కేకలు గ్రహించి
మేఁత సాలించి యాలించి మెడల నెత్తి
వెడలి మొదవులు గహనమ్ము విడిచి చనును.

దైవవశమున నడవిలో దారిదప్పి
చిక్కుపడియున్న యావు నిశీధమందు
ఒడయలేతెంచి కేకల నిడఁదొడంగ
పడయు రక్షణ మంభ యంభా యటంచు.

కాపరుల యందఁ బగలెల్ల గహనమందు
తిరిఁగి పులుమేఁతలను క్షుధదీరమేసి
భానుఁ డస్తాద్రి కేతేరఁ గానవీడి
బారులై పోవుచుండును బశుగణమ్ము.

## పల్నాటి ప్రశస్తి

గొల్లఁ డొక్కఁడమ్మడిగ వృష్టి గురియునపుడు
గట్టుపైఁ జేరి పూలగొంగడి ధరించి
దోటి కఱ్ఱ గడ్డమునకుఁ బోటిపెట్టి
నిలువ గొఱ్ఱెలు మేయు నాకలముతిరిగి.

స్థిరవాసంబుగ గోగణంబులకు వాసింగాంచి షణ్మాసముల్
పరగుఁ గానన నప్పుడద్భుత గవాంపత్యార్భటుల్ నిండ నే
ర్పరులై గోపకులుండ లేగలు సముద్వర్తించి పోకుండఁగన్
సురభుల్ క్షీర మిడంగ దండిగ మహా శోభా సముద్దీప్తమై.

అరయఁ దగియుండుఁ బాటిపై నప్పు డిచట
మంద దొడ్లు ప్రమోదంపు మహిమ దాల్చి
క్రేపు లురుకఁగ గోపకుల్ కేక లిడఁగ
తమకమున గోవు లంభారవము సలుప.

దొడ్లకడఁ జేరి రాత్రులుద్ధురముగఁ బులి
భయము గొలుపఁగ గోపకార్భటుల కుదరి
వెలుగువైపుగ వాఁడి కొమ్ములను ద్రిప్పి
నిలిచి చెలరేగి మొదవులు నిగ్రహించు.

పశువులు పిపాసచే వంత పడయకుండ
వేమగిరి చెఱువన నిట విపినమందు
కదియుకొండల సంధించు కట్ట గలిగి
ఉన్నదిట తటాక మొక్కటి యుదధిఁబోలి.

చెలువంపున్ గిరి కందరాంతికమునన్ జేజెర్ల మార్గంబునన్
కలదీ కాననమందు వేమగిరి తద్గ్రావాఖ్యతో మున్నిటన్
వెలసెన్ గ్రామము పేరునెట్లు గనెనో వేమన్న యే యాయెడన్
తలపున్ బూనివసించెనో యెటుల సన్మానించెనో శైలమున్.

వేమగిరికడ పూర్వము గ్రామముంట
నూరబోడని యియ్యది పేరువడసె
వేమగిరిపాడు నా నటవీ ప్రదేశ
మున్న దిచ్చటఁ దెల్పుచు నూరిపేరు.

గుఱుతు లీరీతిగా నొనగూడు చుండ
బంధురారణ్యమే సూక్తి పడయఁజాలి
గ్రామ మిటనున్న వెనుకటి గాథ నిపుడు
చెప్పుచున్నది సంశయచ్ఛేద మొదవ.

సాంద్ర కాంతార పరివృత స్థాన మైన
వేమగిరి పాటి మీఁదికి వేఁగి రాదు
భద్రగతి నొప్పు ఋశ్యమూకాద్రిపైకి
ఎన్నడైనను వాలి మున్నేగనట్లు.

ఇది విచిత్రముగా నెంతు రిచటనుండు
పరిసర గ్రామవాసులు పల్లెజనులు
ఈస్థలంబున బెబ్బులి కేమి భయమొ!
కారణము చెప్పదగినది కానఁబడదు.

పలునాడేదినమున్ విధించి రణమున్ బాటించి చాటించెనో
జలశయ్యంగొని విష్ణువేదినమునన్ సంద్రమ్ముపై జేరునో
అల యాషాఢమునందు పేర్పడిన శుక్లైకాదశీపర్వ మా
తొలియేకాదశి యాత్రకేర్పడిన సంతోషాహ మీతావునన్.

హృదయ కుహరపుఁ గోణమం దొదిగియున్న
సృష్టి పరమార్థ జిజ్ఞాస చెంగలించి
ఎచటికో భావవీధియం దెగిరిపోవు
నిచటి మహిత ప్రకృతి యుపకృతి కతమున.

# సింగరుట్ల

ఘన పాషాణమునుండి నీరు తొరఁగున్ గ్రావాంతరాళంబునన్
కననౌ నొక్క జలాశయమ్ము నిచటన్ గచ్ఛత్ పరీవాహమున్
ధ్వని పాటిల్లఁగ లోయ కేఁగు జలమున్ బ్రాచీన దేవాలయం
బును నీక్షేత్రమె సింగరుట్ల కనుడీ! పుణ్యప్రదంబెన్నగన్.

గణుతింపందగు క్షేత్రమియ్యది మహా కాంతార మధ్యంబు గో
గణముల్మేతకు వచ్చి క్రుమ్మరునిటన్ గల్పించి సర్వేశ్వర
ప్రణుతుల్సల్పువిహంగముల్ప్రమదమున్బ్రాపించుసారంగముల్
ప్రణయించున్గమనీయభావముల నీప్రాంతంబుస్వాంతంబులన్.

సలలితారణ్య సౌందర్య కలితమగుచు
తెరలు చిత్రాల కలఁతనుఁ దీసి వైచి
ఉల్లముల హర్ష వీచిక లొదవఁజేసి
కానఁబడు నిది శాంతి లోకమ్ము పగిది.

లలితమగు నీటితావు శిలామయమ్ము
ఉపరిభాగమే కాండ్రపు టుపలతలము
నిర్మలమ్ముగ జల్లనిసీడ దాల్చి
అలసటం బాపు నిచటి జలాశయమ్ము.

పరిసరముల వెలయు ప్రకృతి దృశ్యమ్ములు
క్షేత్ర సేవ సలుపు యాత్రికులను
ప్రణయ పథమునందు వర్తిల్లగా జేసి
సత్కరించి చిత్త శాంతి నొసగు.

లోయలే వళుల్గాగ విలోలములగు
లతలె యలకలుగా వనలక్ష్మి కదిది
పసరు వలువను దాలిచి ప్రసవములను
చిమ్ము ప్రావృషయందు క్షేత్రమ్ము మీద.

పొదలు చెట్లు లతలు పుష్పమయమ్ములై
వెల్లివిరియ శోభ యుల్లసిల్ల
మధుకరములు రేగు మధు మాసమున వెద
చిందు సౌరభమ్ము క్షేత్రముపయి.

## పల్నాటి ప్రశస్తి

వెదకి యోషధులను పెల్లగించుకొఱకు
కాయ కసరు లరసి కోయుకొఱకు
తేనె పెరలకొఱకుఁ దిరుగుదు రిచ్చటి
పసుల గాయుకొఱకుఁ బల్లెజనులు.

వన్య సత్వాలు విహగముల్ పశుగణమ్ము
వలయు మేఁతల కడుపార వడయు నిచట
పల్లె లిచ్చటి కాయలు పండ్లు గొనును
అడవి ఫలసాయమున కిది యాకరమ్ము.

రెండు జాములు తిరిగిన యెండ వేళ
నడవిఁ దిరుగాడు వారలీ హ్రదముచెంతఁ
జేరి స్వామికి మ్రొక్కి యాసీనులగుచు
చల్దులం దినుచుందురు సంతసమున.

దేవళమునకు నరసింహ దేవుఁడిచట
నిమ్మచువ్వల తలుపుల నేరుపఱచి
కొలనులోని జలమ్ముల గ్రోలి మ్రొక్కు
జనుల స్థిరకృపాదృష్టితోఁ దనుపుచుండు.

ఇచటి దృశ్య మనోజ్ఞత నెన్ని యలరి
కాకతీయులు నిల్పిరీగట్టున గుడి
పదని పదమూఁడవ శతాబ్ది బల్లెనాటి
ఘనత దీపింప వారేలు కాలమందు.

పాటిగ సింగరి నరహరి
యూటల బహుబ్రీహి మరియు నూహింపంగా
నూటలయె యుట్ల యయ్యెను
ఊటలుగలస్థలము సింగరుట్ల యననిటన్.

సింగ రూటల యేకదా సింగరుట్ల
అట్లె పిల్లూటలయును బిల్లుట్ల యయ్యె
అట్లె తాడూటలయును దాడుట్ల యయ్యె
తెలియఁ జెప్పుచునుంటి తద్విధము నరసి.

# నాగార్జున కొండ

రస విద్యా నిపుణుండు సిద్ధుఁడు మహాప్రాజ్ఞుండు నాగార్జునుం
డసమానుండగు బౌద్ధుఁడున్నతుఁడు దివ్య గ్రావ భాగంబునన్
వసతిం గైకొనెఁ బూతమౌనటుల నీపల్నాడు తత్ప్రాంతమున్
పొసఁగన్ జూడుఁడపూర్వ శిల్ప విభవ ప్రోత్సాహముప్పొంగగన్

పల్లెనాటి నివాసంబుఁ బడసినట్టి
ఈ మహామహుఁడాంధ్రుడో ! యెవరో కాని
బౌద్ధ లోకము వెలిగించి ప్రణుతిగనిన
దినకర చతుష్టయమున నీయనఘుఁ డొకఁడు.

ద్రావిడ స్థాన మగునో విదర్భ యగునో !
అగునో దక్షిణకోసల యాంధ్ర భూమి
యగునో వీని జన్మస్థల మరయలేము
కఠినమగు సమస్య చరిత్రకారుల కిది.

మూలికా ప్రక్రియల నింద్రజాల విద్య
మంత్రశాస్త్ర రసాయన మర్మములను
కాయకల్పమ్మును నదృశ్యకరణి నెఱుఁగు
నీ మహాత్ముని ప్రజ్ఞల నెన్నఁదరమె.

విజ్ఞుఁ డీతఁడు రసాయన విద్యవలన
శిలలు కరఁగించి స్వర్ణముఁ జేయఁజాలె
‑జును జిరాయువును బ్రజ్ఞ రాజిలంగ
దీర్ఘజీవిగ బాధలు దీర్చి చేసె.

చనెను లంకకుఁ గాశ్మీరమున వసించె
కనుఁగొనె హిమాలయమ్ములఁ గష్ట మనక
సలిపె సంచార మెల్ల దేశమ్ములందు
సిద్ధుఁ డీతఁడు మహిమా ప్రసిద్ధుఁ డగుచు.

ప్రకటముగ సిద్ధుఁడున్న నివాస మందు
కడిఁది రోమీయ నాణెముల్గానఁబడియె
నాకతమ్మునఁ దెలిసె నీ యమలుతోడ
గ్రీసు మైత్రినిఁ బడసి చరించెననుచు.

పడసినవి వీని గ్రంథానువాదములఁ ద
పించి చైనా జపాను త్రివిష్టపములు,
ఆంగ్లభూమియు సంతోష మావహిల్లఁ
గైకొనియె వాని భాషాంతరీకరణము.

ప్రాజ్ఞ 'రసవాద' మను గ్రంథరాజ మొకటి
తెలియనయ్యెడి 'లామా' యధీనమందు
పరఁగు గ్రంథాలయమ్మున భద్ర గతిని
కలదని 'టిబెట్టు' దేశాన వలసఁబడసి.

అరసి సిద్ధుని మాహాత్మ్య మధికభక్తి
వసుమతీశ్వరు లాజ్ఞానువర్తులై రి
కూర్చిరర్థము సౌఖ్యముల్ కోరినట్లు
వారిలో శాతకర్ణి నృపాలుఁ డొకఁడు.

వెలయం బ్రజ్ఞ విదేశముల్పొగడఁగా విఖ్యాతిఁ బెంపొంది, ని
స్తులుఁడై రాజుల మన్ననల్పడయుచున్ శోభిల్లి, యీవర్షమున్
కలయంగాంచిన సిద్ధుఁ డీస్థలమునం గావింపఁగా వాసమున్
వలచెన్, వాసినిగూర్చె రెండవ శతాబ్దంబందుఁ బల్నాటికిన్.

ఏల యేతెంచెనో మహాత్ముఁ డిచటికపుడు ?
మారుమూలకుఁ దన ఖ్యాతిఁ మరచెనేమొ ;
దీక్ష గైకొని యెదియొ సాధింపఁబూని
వచ్చియుండెనొ యౌషధు ల్వడయుకొఱకు ?

అరయ నమరత్వ మిత్తఁడు రసౌషధమ్ము
చేసి యొకరాత్రి యశ్వినుల్ చెప్పినట్లు
పృథివికిన్ భారముడుపంగ వీడనాడె
నను బృహత్కథా సూక్తి భావ్యముగఁదోచు.

వెలసెన్ ధామము దివ్యవైభవముతో విస్తీర్ణ శైలంబుపై
తెలిసెన్ శిల్ప కళాప్రభావము జగద్విఖ్యాతమై చెంగటన్
పొలిచెన్ వాహిని నూత్నశోభగొనుచున్ బూర్ణప్రభావంబునన్
నిలిచెన్ సిద్ధుఁడు రాజకాంతలిచటన్ నేర్వన్ మహాయానమున్.

ఒదవె గ్రంథాలయమ్ము ప్రయోగశాల
శ్వశ్వ దఖిల కళా పరిషత్తులపుడు
ఖ్యాతిఁ బడసె సంఘారామ కలితశైల
మిది ప్రసిద్ధ విద్యాపీఠ మిచటఁ దాల్చి.

అది యిఁక నడ్డులేక చను నాంధ్రులకాలము సిద్ధుఁడిచ్చటన్
పదిలముజేసె బుద్ధభగవానుని యస్థిక భక్తి యేర్పడన్
ముదమునఁ బల్లెనాటి కతిముఖ్యులు నాడు యశోవిభూషణుల్
విదిత కళాధురంధరులు వింతగ వచ్చిరి యాత్ర సల్పుచున్.

అంత పోప్లూయమాన ప్రయాణ విలస
దభ్ర పటలోపమేయ నౌకాశ్రిత బహు
జన విలోకన సంతత జనిత మోద
భరితయయ్యెను గృష్ణా స్రవంతి వినుఁడు.

పాదతలమున వాహిని పాఱుచుండ
లోయలు తరుమయమ్ములై లోతు దెలుప
అద్రి గంభీర సౌందర్య మవధరించి
భవనములతోడ నెట్లగపడెనొ తొల్లి?

పడక నిలిచిన భవనంపు భాగములును
వింత గొల్పెడి శిల్పము విశదపఱచి
నేటికివిఁ బ్రేక్షణీకులకుఁ జాటుచుండు
సాటి లేనట్టి నాటి పల్నాటి మహిమ.

గ్రావ ముఖ మార్గ పార్శ్వాలఁగల బురుజులు
మస్తమందలి కోనేరు నిస్తులంపు
కోటగోడలు నిలిచిన గుఱుతు లిపుడు
తెలుపుచున్నవి నగరాజు దివ్యకథను.

అచలపుం బాద తలమున నరయనైన
స్థూపములు దివ్య శిల్ప విశోభితములు
స్వచ్ఛ సలిలము గల బావి శైలమొరయు
నేటికాలువ గిరికీర్తిఁ జాటితెలుపు.

కృష్ణకడనుండి కొండపైకెక్కువఱకు
భద్రముగ నెట్టులిడిరొ సోపానపంక్తి
చెక్కుచెదరక నేటికిఁ జెప్పెడు నది
తొంటి యాత్రా ప్రమోద మద్భుతమటంచు.

జీవకళ యుట్టిపడునట్టి శిల్పములను
తీర్చిరట కళావిలాసమ్ము తేటపఱచి
ఎట్టి ప్రజ్ఞాధురంధరు లీనగమ్ము
జేరియుండిరొ సిద్ధుని సేవ గోరి.

రమ్యముగఁ జెక్కఁబడి యిటు రాళ్లమీఁద
కన్నులకుఁ గట్టినట్టులు కానఁబఱచి
పెక్కు గాధల వివరించు విగ్రహములు
ప్రకటమగుచుండు శిల్ప వైభవము దాల్చి.

విడివిడిగ నిప్పుడొక్క చావడిని జేరి
భవనముల మీఁద విలసిల్లు ప్రతిభఁ దఱిగి
నేటికిని శిల్పములు తమ నిగ్గుఁదెలుపు
తొల్లి గిరిపయి నెట్లు భాసిల్ల వచ్చు.

ఉగ్ర నరసింహదేవుని విగ్రహమ్ము
అవయవపు సౌష్ఠవమ్మున కాకరమ్ము
నిగనిగల్గల యశ్మంపు నిగ్గు చూపు
చున్నదిట శిల్పమును జూఱగొన్నయట్లు.

విఱిగిపడియున్న బుద్ధుని విగ్రహమ్ము
కానవయ్యెడి నేడు నగమ్ముమీఁద
చెలువముం గోలుపడియిట్లు చెదరియుండు
దీని ప్రాశస్త్య మిపుడెట్లు తెలియనగును.

ధాత్రిలో మాటుపడిపోయి త్రవ్వితీయఁ
దగిన స్థూపాలు కొన్ని భూధరముమీఁద
కలవు నేటికి నివియెట్టి ఘనతఁదాల్చి
మంటిలో దాగియున్నవో కంటఁబడక!

సిద్ధుఁడు మహాత్ముఁ డిచ్చటఁజేర్చినట్టి
తీరుగల శిల్పములు గొన్ని చూరగొనిరి
సల్పిరపకృతి ప్రఖ్యాత శైలమునకుఁ.
గీడొనర్చుట మానవ క్రీడ యేమొ!

పదిలముగ స్థూపమున దాచబడిన యట్టి
బుద్ధదేవుని యస్థికా భూషణమగు
వినుత నవరత్న హారము చనిన దెటకొ
కంచెయే చేనుమేసిన కరణి గాఁగ.

బుద్ధదేవుని యస్థిక పోయెనెటకొ!
శిల్పములు కొన్ని గిరి వీడి చేరెనెటకొ!
పోవుటం జూడ వేదన పుట్టుగాని
అచల మేరీతి వారల నడ్డగించు.

ఎల్లాటి ప్రశస్తి

ఏది యెటులున్న నొక్కింత యాదరమున
ప్రేక్షణిక సుఖయాత్రకై వేడుకఁ గాని
ఏరుపఱచిరి కొండపైకెక్క వఱకు
రాజమార్గము నేఁడు సర్కారు వారు.

నదిపయిన్ సల్పు పైనమ్ము లొదువకున్న
ప్రథిత శిల్పాలఁ గొన్నింటిఁ బాసియున్న
ప్రకట యాత్రాస్థలము దివ్య పర్వతాగ్ర
ముది మహాసిద్ధు ప్రజ్ఞ యెట్టిదియొ కాని!

తఱుఁగులేనట్టి విభవము దాల్చినాడు
ధన్యుఁడగు సిద్ధు నామము దాల్చి నేఁడు
శుష్క మూలికయును శక్తి చూపునట్లు
గ్రావమున్నది ఖ్యాతి గోల్పోవకుండ.

ప్రథిత మహనీయ విజ్ఞాన భాస్కరుఁడగు
సిద్ధు మస్తమునంగాని సేవ సల్పి
సత్కృపా బల మేపారఁదాల్చి యుంట
కాలగతిని నిర్జించెడి ఖ్యాతిఁబడసె.

అది యటుండెను బూర్వమహత్వ మెంచి
యాత్ర గైకొని యేతెంచి యరసి శైల
మిచటి శిల్పములంగని యేగుచుందు
రంతకన్నను నెవరాదరింతురిపుడు.

ఎట్టి యోషధు లిటఁగల్గుటెన్న రెవ్వ
రిచట నేఖనిజములుంట నెవరుఁ గనరు
శిథిలములఁగూర్చి తగుశ్రద్ధ జేయరెవరు
భూధరము చాటుచున్నను బూర్వకథను.

ఏది యెటుసల్పకుండిన నేమి గాని
ఉన్న శిల్పాలు మెల్లగా నొక్కటొకటి
యెచటికో చేరకుండుట యేగణింప
నైన సత్కార మదియె మహాఫలమ్ము.

ఇంక నొక యంశమును వివరింప వలఁతు
శిల్ప సంపదఁదనరార సిద్ధు దివ్య
కీర్తి సంపద వెలయ శ్రీగిరి యనంగ
తాల్చె నిది పేరు మున్ను సార్థకము గాఁగ.

శ్రీగిరి యనంగ నగ మిది చెందె ఖ్యాతి
పల్లైనాటను శ్రీగిరి పాదు గలదు
మున్నిది వసించి భూధర మున్నచోట
మార గిరిదళ దూరానఁ జేరె నేమొ.

ఇంతకన్నను మించి యూహింపఁదగిన
కారణమ్మేదియైనను గానరాదు
శ్రీగిరిని గాన మీయూరిచెంత నిప్పు
డేగిరియు లేదు దీనికిట్లిడఁగఁబేరు.

గుఱుతుదెల్పు నాగార్జునకొండవార
లను విశ్వ బ్రాహ్మణుల శాఖ నరయనగును
దుర్గి మాచెర్లల వెలుదుర్తి యందు
కొండకడ వీరు శిల్పులై యుండిరేమొ.

కాల గతి కడ్డమేదైనఁ గలదె యింక
నబ్ధి స్థలమగు స్థలమబ్ధి యగును గాని
మహితుల చరిత్ర మొకటియే మారకుండు
తనరునయ్యది యాచంద్రతారకముగ.

అచలములు నదుల్ కూపాదు లశ్మములును
కాలమొనరించు మార్పులంగనుచు భక్తి
కతనఁజాటు మహాత్ముల కథల నెపుడు
కనఁబడని నోళ్ళతోఁ బ్రతిధ్వనులు పుట్ట.

ధన్యులు మహాప్రసిద్ధ మేధా నిలయులు
జన్మముంగొని సలుపు విజ్ఞాన సేవ
జడములకుఁ గూడ స్తుత్యమై చరితయందుఁ
జేరు స్థిరజీవులుగ వారి పేరు నిలుపు.

# సిద్ధేశ్వరము

కనఁగ సిద్ధేశ్వరమునా జనెడు నొక్క-
క్షేత్రమున్నది కాననసీమ చెంత
నొకెడ తేరాలయూరి యంతికమునందు
కొలది నీరమె తరుగని కొలనుగలిగి.

పొందికను పల్లమందొక నందిగలదు
దాని నోటికి సమముగఁ దనరునీరు
వర్షముల్గూడు తరినైన పైకిరాదు
చనదు క్రిందికి మండువేసంగినైన.

కొలని యడుగుననుండి గైకొనఁగ వచ్చు
సంతసము గొల్పఁగా నొక వింతమన్ను
అది విభూతి యనందగు నంతెకాక
తేటగా నుంచు నచ్చటి యూటనీరు.

ప్రకృతి యొసగిన ప్రపను యాత్రికులకైన
పసుల గాయుచునుండు గోపకులకైన
బడలికలు వాయునట్టులు స్వచ్ఛజలము
నిచ్చు నిట క్షేమమెన్ని నందీశ్వరుండు.

క్షేత్రమున్నది కానన సీమయందు
ఊరియందన క్రోసెడు దూరమందు
తృణజల సమృద్ధమైన ప్రదేశమందు
శాంతిసౌఖ్య మొసంగెడు స్థానమందు

కనదగు దాపునన్ మహితకాండ బహిర్గమయత్ కవాటమున్
వనధి సదృక్ ప్రపూరపరివర్ధిత గాఢచలత్ కృపీటమున్
ఘనతర సస్యసాదిత వికాసవిశిష్ట మనోజ్ఞ ఖేటమున్
ధ్వనిజనయద్వనాట బహువారనివిష్ట తటాకకూటమున్.

ఘనత జూపుచు కానువాగనెడు ధురము
కొల్లగా పంట మండాదికొసగి వచ్చి
చెఱువు నిటు లబ్ధిశాఖగా జేయజాలి
పడయు నల్గునజని చంద్రవంక నవల.

అడవిని మందలై తిరిగి యావులు మేకలు కోరినట్లుగా
వడివడి యాకలంబు సుడివాయగ మేయుచు దప్పిగల్గ, సం
దడిగఁ దటాకమందుఁ దమి ద్రావి జలంబులు ప్రొద్దు గ్రుంకుచో
వెడలి సుఖస్థితిన్ నెమరువేయుచుఁ బల్లెలకేగు నియ్యెడన్.

# గొట్టిపాళ్ళ

కంటిరె గొట్టిపాళ్ళ యచటన్ జలపాతముగల్గు సంగతిన్
వింటిరె మూడుతాళ్ళ నిడివిందగియుండు ప్రపాతమేర్పడన్
మంటికి డిగ్గు నిర్ఝరము మార్గము నందొకచోట నడ్డుగా
నుంటనగాలు, వాగు తగునద్ధతితో జనుదెంచి దూకెడున్.

గరళకంఠునిగూర్చి మృకండుసుతుఁడు
పరమ నిష్ఠాగరిష్ఠుడీ వలతియందు
సులుపఁ దపము చిరాయువు గలిగెననెడి
స్థలపురాణము గలదు క్షేత్రమున కిచట.

కడఁకతో నహోరాత్రముల్ విడవకుండ
చదికిలంబడి తపమును సల్పినట్టి
యొరిపిడికి తెగనఱిగిన యుపలతలము
కలదిచటఁ బ్రేక్షణీకుల కాకథను దెలుప.

మఱియుఁ గలదు మార్కండేయ మడుగనంగ
హ్రదమిచట రమణీయత కాకరమ్ము
పొదలు, తీగెలు, కోమల భూరుహములు
తీరమున గ్రమ్ముకొని యున్న తీరుతోడ.

చిన్న దేవళమందు వసించి యిచట
నున్నవా డీశ్వరుండు మృత్యుంజయుండు
చూడదగి గుడివాకిటి చూరుమీద
పండుకొని యుండు నొకత్రాచుఁ బరవసమున.

చేరగాలోని కెవ్వరైన శివుని గొలువ
దొసగొనర్పదు బుసకొట్టి తొలగిపోదు
భయముతో లోనికేగక బయటనిలచి
బెదరుచుండిన తనతావు విడిచిచనును.

# గుత్తికొండ

చనికాంచం దగు గుత్తికొండ నచటన్ షడ్దర్శనాల్ వ్యాఖ్యనన్
దనరన్ వ్యాకృతి నిస్సమానుఁడును విద్యాశేఖరుండున్ సుధీ
ఘనుఁడున్ వాఙ్మయభాష్యకర్తయు నుమాకాంతుండు దాత్తంబుగా
జననంబుంగొనె నక్కిరాట్టులమునన్ సాహిత్య సారాకృతిన్.

ఆంధ్రగీర్వాణ వాఙ్మయాలరసి, తరచి,
ప్రజ్ఞ రాజిల్ల భాష్యముల్ వ్రాసె మఱియు
లోటుగని, మాటుపడిన పల్నాటిగాథ
కద్భుతఖ్యాతి గూర్చె నీ యసదృశుండు.

ఇనుపకొండ యనఁగ నీయూరిదాపున
కలదు నగము దానికతనఁ దనరి
యినుము చేసిరిచట నేర్పడఁ గొలుముల
పాలె మనెడు పేట భాగమొకటి.

కలవు చిట్టెంబు లిచట నీకథను గూర్చి
తెలుపఁ దఁలచిన యకృత సాక్షులను బోలి
నగము నిద్రించుచున్నదనారతముగ
తెరువఁ బడకున్న కర్మమందిరమువోలె.

ప్రాంతమున నొక నగపుఁ బాపట యనంగ
కురువయున్నది యెత్తైన కొండత్రోవ
రాకపోకల నిది యలరారుచుండు
చిన్నవిగఁ బెద్ద బండ్లను జేయఁజాలి.

ఊరిచెంతఁ బశుగ్రాస ముంచుచోట
సిద్ధహస్తుఁడు చెక్కి చేసినవి వోలె
స్వచ్ఛమౌ జాతి యశ్మముల్భాసిలునివి
ఎట్లు పుట్టెనో గూఢ మింకేమి గలదో!

చెక్కిన విధాన నైదారు ప్రక్కలమర
చివ్వినట్లున్న యగ్రముల్ చెలువ మిడఁగ
కాచములరీతి స్వచ్ఛపుఁ గాంతిఁ దనదు
నివ్వి పైక్రాంతములు నాఁగనెన్నఁబడును.

గుఱుతు గ్గైకొనియున్నదీ యఱుతఁ బ్రకట
చరితమ్మై 'గుత్తికొండ' విస్ఫురిత శైల
భరిత పుణ్యస్థవేరిత దురిత మగుచు
స్థిరత గని ఖిలచర్యయన్నిరతిఁ బడసి.

# సత్రశాల

ఆలయపు వాటిమై సత్రశాల యనఁగ
క్షేత్రమొకటి కృష్ణా తట స్థితము కలదు
పడయుఁ దిరునాళ్ళనిది ప్రతివత్సరమ్ము
స్థల పురాణము దీనికిఁ గలదుకొంత.

జెట్టిపాలెము గన్పింపఁజెంత, కలుగ
నడవిదేవరపల్లియు నవల నదికి
తెలియఁ దగియుండఁ బదునాల్గు దేవళములు
అరసి కృష్ణానదిని క్షేత్ర మలరుచుండు.

ఇచటఁ గలకాక వైచిత్ర్య మెన్నఁదగును
కాకి యీస్థానమునఁ దిరుగాడ దంద్రు
దీని కాక కారణమ్ముగాఁ దెల్పుదురిటు
త్రవ్వెఁ గాకాసురుని కన్ను రాముఁడనుచు.

ఎంతకాలమునుండియో యిచటఁ గలదు
దొనఁ గొనర్పక తిరుగాడు మునలిత్రాఁచు
ఎచట నుండునో పగలిది. యినుఁడు గ్రుంక
మల్లికార్జును కడఁజేరి యుల్లసిల్లు.

# పిడుగురాళ్ళ

పల్లెనాటికిఁ బ్రాఙ్ముఖద్వార మటుల
కలదు పిడుగురాళ్ళ యనంగ గ్రామ మిచట
చాటఁగోరిన యట్టులీనాటి యునికి
యంత్రశాలలు ధ్వనిపుట్టి నాడుచుండ.

ఇట్లు పల్నాటికి సరిహద్దు నెపుడు దెలుపు
ధ్వనులు సలుపుటయేకాక ఘనత దాల్చి
కనులకు మహాద్భుతంబుగాఁ గానఁబడెడు
ఖనిజసంపత్సమృద్ధమై తనరుచుండు.

ప్రాంతమున దీని కొక యుపగ్రామ మటుల
కలదు శోభాసమన్విత నిలయతలము
నడువఁగా యంత్రశాలలు, నాపరాళ్ళ
నంపుచుండెడి మహితకార్యాకరమ్ము.

కొండలం బోలెడిని రాళ్ళగుట్ట లిచట
గర్తములు లోయలంబోలి కానఁబడును
పూనికం గొని పోరాడి పుడమి నిచట
తొలుచున్నాడ సగరు పుత్రులను బోలె.

తిరుగులేకుండఁ బనులిట్లు జరుగుకొలఁది
క్రమముగాఁ గాలమీరీతిఁ జనినకొలది
సువిదితమ్ముగ నిచటి మానవకృతమ్ము
కొదువలేకుండ విభ్రాంతిఁ గొలుపకున్నె!

# కామేపల్లి

పరమ లాక్షణికుండని వాసిగనిన
యప్పకవి కామెపల్లి యనంగఁబరగు
గ్రామమునఁ బుట్టెఁ బల్నాటి గ్రంథకర్త
ప్రథితుఁడెన్నఁగ బ్రాహ్మణపల్లిచెంత.

కొలతలంగూర్చి. స్థిరమైన గుఱుతు లమర
హద్దుల నితండు తన గ్రంథమందుఁ దెలిపె
నింక నీకవి స్వస్థాన మెన్నుపట్ల
వాదమునకుఁ బ్రసక్తియే లేదు కనుఁడు.

# దాచేపల్లి

చూచిన దాచేపల్లిని
తోచెడు నుద్యానవాటితుల్యం బగుచున్
పూచుపొద లాకుఁదోఁటలు
కాచెడు వృక్షాదికములు కలుగుట వలనన్.

కట్టిన యానకట్ట యిటఁ గన్పడు నడ్డుగ నాగులేటికిన్
కొట్టిన కాల్వ యున్న దొనగూర్పఁగ నిచ్చట నాకుఁదోఁటలున్
దట్టపుఁదోపులున్, బ్రతిభదాల్చు పొలంబులు నింకఁ దోయముల్
పట్టి పథంబుపోయెడిని బల్లెనఁ గేతకులూగుచుండగన్.

మఱియుఁ జెంగటఁ గలదు 'గామాలపాడు'
కత్తిచేఁబూని రణమునఁ గాలుదువ్వి
ఖ్యాతిఁ బలునాటిచరితలోఁ గనినయట్టి
నాగమాంబిక కెన్న జన్మస్థలంబు.

పల్నాటి ప్రశస్తి

రెడ్డికులమునఁ బుట్టిమంత్రిణిగఁ జేరి
ప్రకటితంబగు నసదృశప్రజ్ఞవలన
నాఁడు పలునాటినేలెడు నరవరేణ్యు
బోటియాడించె నొక కీలుబొమ్మపగిది.

గామాలనఁ బైల్మానులు
గామాలకు నిలయమైన కారణ మొదవన్
గామాలపాడు నాఁజను
నామము నిది వడసెననుచు నామది నెంతున్.

ఊరిచెంతన నది యుండ నుండు నట్టి
మావితోఁపుల వేసవి మలయు నపుడు
తోయములఁ బ్రతిబింబించు ద్రుమములందుఁ
గూయుచుండును గోకిలల్ కొసరికొసరి.

తోఁటలున్ బాటుపడు జనుల్ తుష్టులగుచు
వింతగావీడి శ్రమను దినాంతమందుఁ
బండ్లు, కూరలు, కాయలు, ప్రసవములును,
బడసి వచ్చెద రిండ్లకు బారుగట్టి.

పీడన్ దాచేపల్లిని
చూడందగు జనపదంపు సూచనలేమిన్
గోడొందినట్లు కడఁబడు
జాడంగొని నాగులేరు చని కనుఁగృష్ణన్.

# పిన్నలి

తలంపఁ బింగళిసూరనార్యునకు స్వస్థానంబుగా నొప్పుచున్
గలదీప్రాంతమునందుఁ 'బిన్నలి'యనన్ గ్రామంబిఁకన్ దీనిలోఁ
గులగోత్రంబుల సామ్యమంతయును గైకొన్నట్టి యార్వేల వా
రలు వర్తింత్రు మహాప్రబంధకవికిన్ బ్రఖ్యాతసంబంధులై.

మున్నిట నీశ్వరువేడెడు
సన్నుతిగాఁ గవియొకండు చాటువు వ్రాసెన్
ఎన్నఁగ నీఁక నాపద్యము,
పిన్నలిఁ బింగళి యటంచుఁ బేర్కొని తెలుపున్.

తెలిపెను సూరనయే తన
కలమునఁ బలునాట వసతిగలదని తమకున్
కలతీరు నేఁగనుంగొని
తలతును బిన్నలియె కవికి స్థానంబగుచున్.

# పులిపాడు

ప్రకృతిదత్తము నిర్మల వారియుతము
తగ్గకుండఁగ వేసవిన్ బుగ్గయొకటి
పాఱెడి నిరంతరము పులిపాటి యొద్ద
నాకుఁదోఁటలఁ బెంచెడి దీటుగలిగి.

చల్లగానుండి శోభకు స్థానములయి
యాకుఁదోఁటలు, ఫలవృక్షవాటికలును,
కలవు చూడంగఁదగుచు నీగ్రామముకడ
నిఱుకటపుటింటి కారామ మిడినయట్లు.

చౌటికరనేలఁ బెరిఁగిన చవికతమునఁ
గలదిట దములపాకుల గాటుదనము
వలయుదురు వీని నైజాము వారు జనులు
చను నెగుమతిగ నివ్వి కృష్ణను దరించి.

కడిఁది శ్రీనాథ చాటువు గాఁగఁ దలఁచి
వారువీరను బిరుదాంకించు పద్యమందు
వ్యాఘ్రనగరముగాఁ బేరు వడసినట్టి
గ్రామమిది దీనిడాపునఁ గలదు కృష్ణ.

# దుర్గి

దుర్గి యున్నది మాచెర్లత్రోవమీద
రాజమార్గపు బాయ యేర్పడిన చోట
ఆలయంబులనిడు విగ్రహాలఁ దీర్చు.
శిల్పులను గల్గియుండు ప్రసిద్ధి వడసి.

హాలికవృత్తినిఁ బోతన్న ననుసరించి
యిచట వాక్శుద్ధితో వసియించె నొక్క
భక్తుఁడు చిరుమామిళ్ళసుబ్బయ్య యనెడి
కమ్మవంశోద్భవుండు నిష్కల్మషుండు.

పరమసతిపుట్టి దిగుమర్తివారియింట
కమ్మకులమున దుర్గిలక్ష్మమ్మ యిచట
పూసకూర్పున నీ యితిహాసమెల్ల
గానమొనరింత్రు సంచారి కథకులిపుడు.

కలదీయూరి సమీపమందు జలముద్గారించుచున్ బుగ్గ పు
ష్కలమై చండమయూఖుఁడేర్చు నడివేసంగిన్ వడిన్ బారుచున్
సలిలస్ఫూర్తిగ క్షేత్రవాటికల ప్రాశస్త్యంబు చూపించుచున్
కలిమింగూర్చుచు, మల్లికార్జునుఁడు గల్గన్ జెంగటన్ బొంగుచున్.

తలప నిచ్చటి యాకుఁదోఁటల విధమ్ము
చల్లదనమున హాయిగా నుల్లసిలఁగ
నెపుడు తడియారి పోకుండ నేఱుపఱచి,
ప్రకృతివట్టిన వీవనభాతిఁ దనరు.

ఇచటితోఁటలఁ బనిచేసి యెండవేళ
బడలికలు వాపుకొన గట్లపైని దనరు
పాదపచ్ఛాయలను గోరి పడయు వారు
కునికి నిద్రించుచుంద్రు జోకొట్టి నట్లు.

# మాచెర్ల

ఇది మహాదేవుచెర్లగా నెన్నఁబడును,
బ్రహ్మనాయుఁడు దీని నిర్మాణకర్త
చెలువుకతన "మహాదేవుచెర్ల" పేరు
చేకొనినయూరె నేటి మాచెర్ల కనుఁడు.

ప్రాపింపన్ గురిజాల ఖ్యాతిని నృపావాసప్రదేశంబుగా
నీపల్నాటిని వీరగాముఁడు ధరిత్రీశుండు పాలించుచో
సాపత్నేయులు మల్లదేవులు ప్రభుస్థానంబు మాచెర్లయై
కాపైబ్రహ్మన యుండనేలిరి, విభక్తంబైన సంస్థానమున్.

దొర్లెడువారిపాతము నుతుల్ గొనుచుండఁగ నంతికంబునన్
పొర్లెడునీటితోఁ దరలిపోవఁగఁ బ్రక్కనఁ జంద్రవంక నే
ర్పర్లగు తోఁటకాపరులు వర్తిలువాఁటిక లుండునట్టి మా
చెర్ల వహించి చెన్నుకృప శ్రీకరమై యపుడెట్టు లుండెనో!

# తేరాల

తేరు నా బండి పూర్వమీ యూరిచెంత
తేరులకు రాతిగానులఁ దీర్చి యుంట
తేరురాళ్ళ తేర్రాళ్ళయై స్థిరపడంగ,
పేరు తేరాల యయ్యె నీయూరు వినుఁడు.

దారునిర్మిత చక్రము ల్దారసిలఁగ
ముగియఁ ధనపని మిగులఁ బ్రమోద మంది
యలజడింబాసి సుఖనిద్ర నరయఁ జాలి
యున్నదిచ్చట రాతిగాన్లాదవెదు గని

అరయ తేఱ్ఱాళ్ళ తేరాల యైన పగిది
కాకిరాళ్ళయు నట్లయ్యెఁ గాకిరాల
చాపరాళ్ళయు నట్లయ్యెఁ జాపరాల
ప్రకటమగు బహుబ్రీహి రూపములు వడసి.

# తుమురుకోడు

అనుకూలంబుగఁ గృష్ణతోఁ దుమురుక్కోడన్ గ్రామపుం దాపుగాఁ
జని యుత్కంఠతఁ జంద్రభాగ కలియున్, సాధించిరాయూర సు
బ్బున మున్నిన్మను సుప్రసిద్ధ ఖనిజంపుంగుట్ట లీనాటికిన్
తన సౌభాగ్యపు మూటవిప్పుటకు చేతన్ గామిఁ జింతిల్లెడున్.

ఇచటి కొలుములగుట్టయు నిప్పటికిని
కుప్పలుగనున్న చిట్టెము ల్గొంతులెత్తి
చెప్పుచున్నవి విసువును జెందకుండ
తగినరీతిగ నవి చెప్పఁదగిన మాట.

ప్రాంతమునఁ గృష్ణతోఁ జంద్రభాగ కలియు
సంగమ స్థాన మున్నదిసలలితమ్ము
నదికిఁ దనకథ దెల్పుచున్నట్లు ఝురము
ధ్వనులు పుట్టఁగ శిలలపైఁ బర్వు నిచట.

అచటి శీకరవాయువు లరయఁ దగిన
పులినతలములు శ్యామలభూరుహములు
లతలు పెనగొను పొదలు శిలాతలములు
తీయని జలమ్ములును హారదాయకములు.

# గురిజాల

అరయ నీనాటి రాచకార్యములపట్టు
మాధవీపుర మనుచు శ్రీనాథసుకవి
ప్రకటపరచిన గురిజాల పల్లెనాట
కామభూపాలుఁ డున్నట్టి గ్రామముగద.

గురిజయన గురివెంద వ్యాకరణసరణి
గురిజల యనన్బహువ్రీహి, గురిజలుగల
స్థలమనెడి యర్థముగ గురిజలయె కాలఁ
మారుపుంజెందె, గురిజాల పేరువడసె.

కలదనుచు నీటికొఱంత యీగ్రామమునకు
చదువుచుందురు చెడనాఁడు జాటువొకటి
లోపములకేమి? నీటికి లోటుపాటు
పడయదే నేఁడు మద్రాసు పట్టణంబు ?

మాటుపడియున్న యీసీమ మాటనెవరు
తలఁపకున్నారుగాని, తత్పరత గలిగి
జతనమున్సల్ప, పలునాడు జలమయమ్ము
గాకయుండునె, పంటలకఱపుదీర ?

హైహాయ వంశజాత వసుధాధిపులేలిన రాజధాని, యు
త్సాహముతోడఁ బొంగిన ప్రధాన పురంబిది పల్లెనాటికో,
సాహసికుండెవండో చెడుచాటువు వ్రాసిన వ్రాయుఁగాక సం
దేహము గూర్చునే చరితదెల్పెడు తద్గణనా ప్రసిద్ధికిన్.

అరణముగఁ బల్లెనాడు హైహాయకుల ప్ర
భవులు పంద్రెండవ శతాబ్దిఁ బడయుఁగలిగి
యించుమించుగ నెనుబది యేండ్లపాటు
ఘనతతోనేలి చరితలో ఖ్యాతి గనిరి.

# కారెంపూడి

వెనుక రాజులు చెలరేగి విక్రమమున
చెంగటన్ బోరుసల్పిన క్షేత్రమగుచు,
విదితమింక కారెంపూడి యిదియ ప్రథమ
జనపదము నాగులేటిని గని తనియఁగ.

ఏటిపొడవునఁ గమనీయ వాటికలయి
చూపుమేరకుఁ గనుపించు శోభదాల్చి,
కలవుతోఁటలు సంతోషకారణములు
తీర్చఁబడియున్న చలువ పందిరులఁబోలి.

ఇసుక యడుగుననుంట నొకింతయైన
కలుష మొదవక నారోగ్యకరములైన
తోయములతోడ సౌఖ్యప్రదాయకముగఁ
దనరుచున్నది యిట గంగధారమడుగు.

రాజమార్గాల కూడలి గ్రామమగుట
మిగులఁ గవటాకులును బెద్ద మొగలిచెండ్లు
అలరులును బండ్లు నిచటఁ బ్రయాణికులకు
నమ్ముచుందురు తట్టల నమరఁబట్టి.

ఇచ్చట మున్నుయుద్ధమున నెన్నికగాంచిన యోధులెందరో
చొచ్చిరి పోరి స్వర్గమును, శోభిలు వీరుల దేవళంబులో
నిచ్చట వీరపూజ ప్రతియేట నొనర్చెద రుత్సవంబుగా
వెచ్చని నెత్రు నాళముల వేగమపొంగదె చూడనేరికిన్?

ఘనమగు వీరస్మరణం
బొనగూర్చెడు దీనిఁ బొగడు బుద్ధివొడమ మ
న్నన శ్రీనాథుఁడు సత్కవి
మును వ్రాసెను జాటువొకటి మోదముతోడన్.

# నాయకురాలి కనుమ

ఒనరన్ నాయకురాలిపేరఁ జను గ్రావోత్సృష్ట మార్గంబునన్
ధ్వనితోవచ్చును నాగులేరొసఁగఁగాఁ బల్నాటికిన్ శ్రేయ మీ
కనుమన్ మించిన పట్టులేదు నిలుపంగా నానకట్టన్, సిరిన్
గను నీప్రాంతము క్షామమేగునిట నీకార్యంబు సిద్ధించినన్.

కొండలసందు త్రోవపురికొల్ప నరణ్యముగాంచు ఛావ, మీ
గండినకొక్కనాడు నలగాముఁడు పల్లెలకేగి రానిటన్
బండువుచేసి నాగమ యుపాయముగాఁ గొనె మంత్రిణీత్వమున్
దండితనాన, నప్పుడుపథంబిది యామె సమాఖ్య దాలిచెన్.

పృథుదేహ స్ఫుటప్రోత్కటోద్భటభటాభీలంబుగాఁబోయి, యీ
పథమున్ గట్టెను వైర్యభేద్యముగ దర్పంబొప్ప నాగాంబ, దో
ర్విధ విఖ్యాతిననిన్ గనన్ దనరి, కారెంపూడిలో సంగడీల్
వ్యధరేచన్ బెరగండిదొల్చిచనిరాయైతిహ్యమున్ వింటిరే?

పంగయిచ్చట నాగాంబ పట్టెననుచు
దోర్బలులు వీరుఁట గండి గొల్చిరనుచు,
గురుతులం దెల్పి నిచ్చటి కొండఁజూపి
పల్కుదురు కొందరిది యసంభవమటంచు.

పంగనుబట్టె నాగరిత వైరుల దర్పమడంపఁ గోరి, తె
ల్పింగద మార్గబంధనము, పొందనిక్రిందుగఁ ద్రోవఁజూపెనా
భంగపడంగఁ జేసెనను పల్కేకదా! యిఁకగండికోఁత చా
టుంగద వీరవిక్రమ మిటుల్కథ దెల్పఁగ మోదమబ్బదే.

# చాటుపద్య ప్రతివచనములు

ఎందఱు కీర్తిగోరు ధరణీశ్వరులేలిరి పల్లెనాటి ? మే
లందగ నాంధ్రభూపతులు, హైహాయ గోత్రులు, కాకతీయు, లె
న్నందగి రెడ్డిరాజులు, కసందగిరాయ, లనంతరాగతుల్
పొంది జవంబుకాలమిటు పోవును మార్పులు చేయఁజాలుచున్.

అరయఁ బదునాల్గవ శతాబ్దియందు, రెడ్లు
వడసి యేలఁగఁ జొచ్చిరి పల్లెనాడు,
వచ్చెనప్పుడు శ్రీనాథ భట్టసుకవి
యిచటఁగల విశేషమ్ముల నెఱుఁగఁగోరి.

రాజాస్థానమునందు భోగములతో రాజిల్లు శ్రీనాథుఁడే
యోజించెన్ మది పల్లెనాటికథ, నుద్యోగించె వ్రాకువ్వఁగా
బూజించెన్ ఘనుఁజెన్నకేశు వరదున్ బ్రోత్సాహమున్ గోరుచున్
జేజే చూపఁగ దారి, వ్రాసెను బ్రశస్తిన్ వీరచారిత్రమున్.

ప్రథిత కవివరు పేరుతోఁ బఱఁగుఁ జెనఁటి
చాటువులు చెప్పిరెవ్వరో స్వల్పమతులు,
ఘనతఁ బలునాటి కొకవంకఁ గలుగఁజేసి
చెడుగ శ్రీనాథుడిట్లేల చెప్పియుండు ?

చాటువులరీతి నరయఁగాఁ జవియెలేదు
సుకవి పోకడ యిసుమంత చూడఁజాల
మరసి కవిసార్వభౌముఁ డీయనుచితముల
నిట్లు వ్రాసెనటంచు నే నెన్నఁజాల.

శ్రీనాథుండుపకారికూర్చెను మహాశ్రేయంబు పల్నాటికిన్
నానాదేశములెన్న వీరధరణీనామంబు సాధించి, యొౘఁ
గానీ, చేటుగఁ జాటువుల్వెలసెఁ దత్కావ్యాఖ్యగల్పించి, యీ
న్యూనోక్తుల్ కవిరాడనుక్తములుగా యోజించి ఖండించెదన్.

"చిన్నగుళ్ళు, ఫణులు, చిల్లరదేవుళ్ళు
తేళ్ళు, సజ్జజొన్నకూళ్ళు, నాగు
లేటి నీళ్లు, పల్లెలిటనాపరాళ్ళ"ను
చాటువొకటి దీనిమాట వినుఁడు.

చిన్నగుడులవలనఁ జేటులేదొక్కింత
గుడులు పెద్దవైన నుడుపవఘము,
పఱఁగునెచటనైన భగవంతుడనియేడి
పలుకులేదె ! భాగవతమునందు.

పాము త్రేళ్లెటలేవు ? కల్గెనె యిటంబల్నాటనే ! యల్లెపో !
ధామంబోషధికిద్ది తద్విషహతిన్ దప్పింపగాఁ జాలెడున్
స్వాముల్గల్గరెనిర్నిమిత్తముగ నొవ్వంజేయు వారెల్లెడన్ ?
పాము త్రేళ్ళిక వారికన్న ఘనమే భాషింపగా నేటికిన్ ?

మాటగాఁదెచ్చి యక్షరమైత్రి కొఱకుఁ
జేర్చి చిల్లరదేవళ్ళఁ జెప్పెఁగాని
జనపదమునెన్ని, శ్రీరామ హనుమదాది
యాలయములిట లేని తావరయఁగలమె ?

తలఁచి జొన్నన్నమెంతగాఁ దల్లడిలిరొ
చాటువుల నన్నిటం బ్రజ్ఞఁదేటపఱచి
తెచ్చి జొన్నన్నపుఁ బ్రశంస తెగడిరెవరొ
తద్విధముగూర్చి తెలుపఁగాఁ దలఁతు వినుఁడు.

పల్నాటి ప్రశస్తి

కడుపు చల్లగఁ జేయ నాకలిని దీర్ప
బలముచేకూర్ప నారోగ్యభాగ్య మొసఁగ
నలసి పనిచేయు వారలకరయఁ గలమె
జొన్నయన్నము మించిన యన్నమొకటి!

సన్నన్నంబు ప్రసిద్ధరోగముల కాస్థానంబు నేఁడెన్నఁగా
జొన్ననంబగదంకర ప్రతిభతో శోభిల్లెడున్, జాటువీ
తెన్నుంగానక రోగి యౌషధమునే ద్వేషించునట్లాడుఁబో
మన్నింపందగనట్టి వాక్యజనితోన్మాదంబు నేఁడేటికిన్.

వరతోయాఢ్యము నాగులేరు, కనుఁడాప్రాంతంబులన్ గన్నులన్
విరియంబండిన పండ్లతోఁటలు, లతావిఖ్యాతసూనంబులు
బ్భరముంజూపెడు కూరగాయలమడుల్, ప్రఖ్యాత కేదారముల్
తెరలై యూగెడు నాకుఁదోఁటలును,సంతృప్తిన్ బ్రసాదించెడున్.

పల్లెలున్నవి లేవిటఁ బట్టణములు
వలయు ధాన్యాదులన్నియుఁ బండునట్టి
పుష్టిగల పల్లెలివి స్వయంపోషకములు
పల్లెలేకద బ్రదికించుఁ బట్టణముల.

రా.

పరగన్ నైజమనోహరంబు ఖనిజావాసంబు పల్నాడు, ఛా
సుర దివ్యస్థల వాహినీ నగ వన స్తోమాభిరామంబుగా
నరయంజాలక నాపరాళ్ళనుట పైత్యావేశముందెల్పు, త
త్పరుడై మాన్యులుగాంచుస్థానమిదియాత్రామోదముప్పొంగఁగా.

ఏలా మేలము భ్రాంతిమూలముగదా! యేలా దురాలాపమున్?
వాలాయంబుగఁ గర్మమందిరములన్ వర్తిల్లఁగాఁ జేయుచున్
మేలౌ వంతెనలానకట్టలు తమిన్ మిన్నంటు సౌధంబులున్
గ్రాలన్ గూర్చు మహాప్రమోదము కనంగ న్నాపరాళ్ళేకదా!

ప్రావృషను గారుమబ్బులుపట్టి, వృష్టిఁ
గ్రుమ్మరించుచునుండ నొక్కుమ్మడి, నిట
నాపరాళ్ళ పొలమ్ముల డాసిమేసి
పశుగణమ్ములు వంతను బడయకుండు.

కలవు పలునాట వజ్రపుగనులటంచు
సప్రమాణముగా వీరచరిత దెలుపు
పూర్వభూమిక నాఁడవ పుటనరయక
ఏల వాకొన నాపరాళ్ళిటఁ గలవని?

పల్నాటి ప్రశస్తి

ఇనుము, సీసము, రాగియు, నిచటఁగలవు
ఖనిజములే రాగి ధారణి గర్భమందు,
శాస్త్రవేత్తలు దెలిపెడి సరణిగనక,
నాపరాళ్ళట నున్నవనంగ నేల ?

పలురకమ్ముల పంటలు పండునట్టి
నల్లరేగడ నేలలున్నవి మహాప్ర
సిద్ధములు, తద్విధమ్మును జెప్పకుండ
నాపరాళ్లను లోపము చూపనేల ?

"రసికుఁడేగఁడు పలునాడు రంభమైన
వచ్చుకునేకులు, దున్న నృపాలుఁడైన
కోరి కుసుమాస్త్రుఁడును జొన్నకూడుగుడుచు
ననెడి చాటువు విధమెల్ల నరయుడింక.

పరిణతంబగు బుద్ధిని బడసెనేని
రసికుఁడగుగాని వేసపుఁ బసవహించి
కుతుకముప్పొంగ రంభలఁ గోరువాఁడు.
రసికుఁడా! వానికన్న నరసికుఁడెవఁడు ?

బాబా

పాటుపడు కాంతలను, బుణ్యవతుల, సతుల
బుద్ధిమతుల గణింపఁగాఁబోలుఁ గాని
కులుకుచుండెడి రంభలవలచి తలఁచి
పరితపించెడి జాడ్యము వదయనగునె.

వడుకఁగా రాట్నమొసఁగును వస్త్రములను
హాలముచేఁబూని దున్నఁగా నన్నమొదవు
కూడుగుడ్డల కఱవును గూర్చునట్టి
చాటువుల నెన్నువారు ముష్కరులుగారె ?

రసముతొలుకాడు పద్యముల్ వ్రాసినట్టి
ప్రాజ్ఞుఁడు, మహాకవీంద్రుడు, భక్తవరుఁడు
హాలముచేఁబూని పోతన్న యక్కజముగ
పొలముదున్నిన యంశమున్ దలఁపవలదె ?

తలఁచి రాట్నమె భాగ్యసాధన మటంచు
వలచి రాట్నమె ప్రాప్యమౌ వస్తువనుచు
ఖండఖండాతర ఖ్యాతి గనినయట్టి
ప్రథితుఁడగు గాంధియే నూలు వడుకలేదె ?

---

## పల్నాటి ప్రశస్తి

సాత్వికతతోడ శోభిల్లు సత్పురుషుల
మహితవర్తనమును చెల్వు మతిగొలంగి
యెన్నుమెత్తని మెతుకుల కేప్పునట్టి
కుసుమశయలను చాటువీ ఘోషఁగనుఁడు.

# మాడుగుల

మఱియుఁ దీర్చిన యాకృతి మహిమయు, విని
ర్మలతయుంగల యిట్టి యశ్మములు గలవు
మాడుగులకడ నొకచోటు, మణులవిందు
మెసపుటంజేసి పడియున్న మెతుకులట్లు.

మాడుగులగాదు మడుగుల
చూడఁబహుశ్రీహిఁ యూరిసొబగున్ దెల్పున్
మాడుగుల య్యైన నిచ్చట
గోడాందెడు వారలేరి కుదురనిదురదన్ ?

## అడిగొప్పుల

కొండల సందునుండి యడిగొప్పులపైఁ బ్రసరించు మెండుగా
నుండు సమీరణంబు, నెలకొల్పఁగ నియ్యెడ గాలియంత్ర ము
ద్దండ ఫలప్రదంబగును, దత్పరమార్థ విచారశూన్యులై
కొండొక చాటుపద్య ప్రతికూలత నెన్నిహసింపనేలొకో ;

# సవరణ పట్టిక

| ఉన్నది | ఉండవలసినది | పుట | పంక్తి |
|---|---|---|---|
| దూర్వాసుఁడు | దుర్వాసుఁడు | 9 | 4 |
| సన్మానార్హుఁయుసుంతదేఁ | సన్మానార్హుఁదేసుంతయుఁ | 11 | 6 |
| యట్లుబొలిచి | యట్లుబొలిచి | 24 | 6 |
| ప్రమోదమును | ప్రమోదము | 25 | 8 |
| క్షేత్ర ప్రభావమ్ము | క్షేత్ర భావమ్ము | 29 | 7 |
| గోపులంభారవము | గోపులంబారవముల | 33 | 12 |
| ఉన్నదిట | ఉన్నది | 34 | 4 |
| ఏల యేతెంచెనో | ఏం చేతెంచెనొ | 43 | 1 |
| శ్వశ్వదఖిల | శశ్వదఖిల | 43 | 14 |
| పదిలముజేసె | పదిలముచేసె | 44 | 2 |
| తీర్చిరిట | తీర్చిరి | 45 | 14 |
| లను విశ్వబ్రాహ్మణులశాఖ | లనెడి విశ్వబ్రాహ్మణశాఖ | 50 | 10 |
| సిద్ధేశ్వరమునా | సిద్ధేశ్వరమ్మునాఁ | 52 | 1 |
| గొట్టివాళ్ల యచటన్ | గొట్టిపాళ్ల దరిగా | 55 | 1 |
| తగు పద్దరితో | తగు సుద్దతితోఁ | 55 | 4 |
| సులువఁ దవము | సలుపఁ దవము | ,, | 7 |
| విడవకుండ | విడువకుండ | ,, | 9 |
| త్రాచుఁ | త్రాఁచు | 56 | 8 |
| తోలుచున్నారు | తొలుచుచున్నారు | 52 | 4 |
| యనంగ | యంచనఁగ | 64 | 2 |
| తోఁటలున్ | తోఁటలన్ | 66 | 13 |
| తలంపఁ | తలఁపం | 68 | 1 |
| దీటుగలిగి | యనువుగలిగి | 69 | 4 |
| ఫలవృక్ష వాటికలును | ఫలభూరుహముల వనులు | 69 | 6 |
| దెల్పుచున్నట్లు | దెల్పనోనాఁగ | 76 | 11 |
| కలుషమొదవక నారోగ్య | కలుషమొదవక యారోగ్య | 79 | 10 |
| జొన్నవం | జొన్నన్నం | 86 | 6 |